Photo by P. K. Patel



బహుమతి
పొందిన వ్యాఖ్య

మెడ వంకర

పంపినవారు :
పి. సీతమ్మ - అనకాపల్లి






వాహినీ చిత్రము

# పెద్ద మనుషులు

రచన: డి.వి.నరసరాజు  నిర్మాత-దర్శకుడు: కే.వి.రెడ్డి B.Sc.(HONS)

మనిషికి ప్రాణంకంటె గూడ నీతిప్రధానం!
యీపరమసత్య నిరూపణే యీ చిత్రానికి
ప్రధాన లక్ష్యం!

PHONE: 31 GRAMS: PUBLISHERS




## మీడియమ్ డిక్షనరీ

## Balasaraswathi Pictorial Medium Dictionary

**ENGLISH - ENGLISH : TELUGU**

with English Synonyms, Antonyms, Definition sand Illustrations together with an Encyclopedia for Students

విద్యార్థులారా :

మా డిక్షనరీ విద్యార్థులకు-విజ్ఞానవేత్తలకు నిత్యం వారు చేసే విద్యా వ్యాసంగంలో ఎంతో ఉపయోగపడుతోంది. వేనకువేలు దీనివల్ల నేడు లాభపడుతున్నారు. విజ్ఞానం కావాలని, ఆంగ్లభాషలో పరిశ్రమ చేయాలని అనుకొనేవారందరికి చేదోడు వాదోడుగా వుంది, మీకా భాషలో శక్తిసామర్థ్యాలు తక్కువగావున్న లోపాన్ని తీర్చగలదు. ఇందులో మీకు అవసరమైనట్టి పదాలన్నింటిని కూర్చి సరిక్రొత్త పద్ధతిలో (English to English and Telugu and English synonyms, Antonyms, Definitions, and Illustrations together with an Encyclopedia for students) చేర్చి అందము చందము లొలికేట్లుగా ముద్రించినాము. విద్యకు - విజ్ఞానానికి పరీక్షలో విజయానికి మీకు ఈ డిక్షనరీ ఎంతైనా తోడ్పడగలదని హామీ యిస్తున్నాము. పూర్తి క్యాలికోబైండు మీడియం డిక్షనరీ ధర రు. 9-0-0. జెం డిక్షనరీ ధర రు. 4-8-0. తక్కువ వెల ; ఎక్కువ విలువ :: అవకాశాన్ని జారవిడుచుకోకుండా జాగ్రత్తపడాలని మిమ్మల్ని ప్రత్యేకంగా కోరుతున్నాము.

బాలసరస్వతీ బుక్ డిపో, పోస్టు బాక్సు నెం. 3 కర్నూలు & మద్రాసు 1.

హిగ్గిన్‌బాథమ్స్ రైల్వే బుక్ స్టాలులలో దొరుకును,

---



## డోంగ్రేగారి

### బాలామృతం

బలహీనమైన బిడ్డలకు పుష్టినిచ్చి, పండ్లు మొలిచేటప్పుడు అయ్యే విరేచనములు నిలిపి, బలమును ఆరోగ్యము నిచ్చును.

K. T. Dongre & Co., BOMBAY-4

---

పేరొందిన చందమామ బృందంలో మరిఒక భాష

## (గుజరాతీ) చందోమామ

వెలువడబోతున్నదని ప్రకటించుటకు

కుతూహల పడుతున్నాము

★

| సంవత్సర చందా | విడి సంచిక |
|---|---|
| రు. **4-8-0** | **0-6-0** |

★

ఏజన్సీ షరతులకు వ్రాయండి

చందమామ పబ్లికేషన్స్, మదరాసు-26

అది మధురమైనది ...

అన్నికాలములకూ మంచి రుచి గలబిస్కత్తులు. పాలతోను, గ్లాకోజుతోను తయారై, విలువైన విటమినులతో నిండివున్నది.




జె. బి. మంఘారామ్ & కో.,
గ్వాలియర్.



నరిషింగ్
బిస్కట్లు




ఏనుగు మార్కు

'మైసూర్‌పాక్' మిఠాయి

చిన్నపిల్లలకు ఎంతో ఇష్టం

మీరు అనేక రకాల మిఠాయిలు రుచిచూసివుంటారు. అయితే ఒకసారి ఏనుగు మార్కు "మైసూర్‌పాక్" రుచిచూడండి. ఆ కమ్మదనం, ఆ రుచీ చూశాక దాన్ని వదలరు. రుచితోపాటు, ఆరోగ్యమివ్వగల శక్తి నిండివున్నవి.

కానీ, అర్ధణా, అణాలకు బిళ్లలరూపంలో చిన్న, పెద్ద షాపుల్లో దొరకును

ఏజంట్లు లేనిచోట్ల ఏజంట్లు కావాలి

ఎ. ఎస్. వి. ఎస్. ఎమ్. & బ్రదర్స్
22, అప్పుమేస్త్రీ వీధి, మన్నడి, మదరాసు - 1

సకల దంత వ్యాధులకు

# కోతిమార్కు నల్ల పండ్లపొడి



ప్రతిచోట దొరకును.

నోగి అండ్ కో
87, చైనాబజార్‌రోడ్, మద్రాసు-1

స్టాకిస్టులు: ట్రేడ్ ప్రామోటింగ్ కార్పొరేషన్
పోస్టుబాక్సు నెం. 50, విజయవాడ-2.

# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

మన చందమామ ప్రారంభించిన పోటీలలో పాఠకులు ఎంతో ఉత్సాహాన్ని కనబరిచినందుకు సంతోషం. పరిశీలన జరుగుతున్నది. అన్నట్టు- కథలపోటీకి గడువు మార్చి 15-వ తేదీవరకూ ఉన్నది; తెలుసుకదా! ఈ సంచికలో మీరు ముఖ్యంగా గమనించతగినది గేయకథ. ఇది బ్రిటిషువారి పరిపాలనలో జరిగిన ఒక సంఘటనకు 'నృత్యగానం'. దీనినే చిన్నమాటలలో 'బుర్రకథ' అంటున్నాము. ఈ రకం కథలు ఇంతవరకూ ఏదైనా ఉద్యమం ప్రచారం చేయటానికి సాధనగా ఉపయోగపడుతున్నవి. కాని, మంచి చారిత్రక గాథలు ఎంచి బుర్రకథలుగా తయారుచేసి ప్రదర్శిస్తే, రక్తి కడతాయి. పైగా వినేవాళ్ళ మనస్సుకు బాగా నాటుకొంటాయి. ఇప్పుడీ 'వీరగున్నమ్మ' కథ మీకు యెలా నచ్చిందీ వ్రాస్తారుకదూ!

సంపుటి 14 : మార్చి 1954 : సంచిక 3



SANKAR.



# వీరగున్నమ్మ

[మన తెలుగుదేశంలో విశాఖజిల్లా పేరు అందరికీ తెలిసిందే. అక్కడ రాజమణిపురం అనేచోటున జరిగినటువంటి చిత్రకథ ఇది—]

వినవె ముద్దుల చిట్టిచెల్లెలా
వీరవనిత చరితం
సరసరాలును జలదరించు నవ
నారీమణి కథనం
తరతరాలు విక్రాంతులు చిలికే
తరుణి వీరచరితం
భారతీయ రైతాంగ చరిత్రకు
ప్రాణంబీ కథనం
సానుమాను గున్నమ్మ చరిత్రం
సమరసార భరితం! ॥తం॥

సానుమాను గున్నమ్మ చరిత్రం వింటే పల్లెటూరి ప్రజలే కాదు, భారతీయులంతా ఆనందంతో గంతులేస్తారు.

భాయి భళానోయి తమ్ముడా - సై
భాయి భళానోయి - దాదానా!
సుందరాల రైతుసీమరా - సై
'మణిపుర' నగరపు భూమిరా - సై
అందు దివాను రాబందురా
మందుడై ప్రజల బాధించెరా
పందుంపుల్లలకున్ను పన్నురా - సై
సందు జిక్కిన జప్తు చేయురా ॥

ఆ మణిపుర దివాను బహు కఠినుడు. రైతులను ఘోరంగా పీడిస్తూ, పందుంపుల్లలకుగూడా పన్ను విధించేవాడు. రాను రాను ఆ రాజ్యంలోని రైతుల స్థితి అతి దుర్భరమైపోయింది.

మణిపుర నగరపు ప్రజల బ్రతుకులే
ముందిర ఓరీ తెలుగన్నా
ఎందుగన్న రైతాంగము రోదన
కుందిరి జనములు ఓరన్నా
క్రిందు మీదయి రైతుల బ్రతుకులు
బ్రమందె జీవనా లోయన్నా

(నృత్యగానం)—రచన : కె సభా

వందలాదిగా పేదల నెత్తురు
చిందిపోయెరా ఓరన్నా
ఎందరున్న యింకెందరున్న మరి
యెందరున్న మేలేమన్నా!

అత్తింటి సొమ్మును అల్లుడు దానంచేసినట్టు ప్రజల సొమ్మునంతా దోపిడీచేసి దివానుగారు జమీందారువారి ధనాగారాన్ని నింపివేస్తున్నారు. ఇట్లావుంటే, రైతులు అందరూ ఒక్కటై 'అటవీ సత్యాగ్రహం' చేయాలనుకున్నారు. అటవీ సత్యాగ్రహం అంటే రైతులు స్వేచ్ఛగా అడవిలో కట్టే కంపా కొట్టి తెచ్చుకోవడ మన్నమాట.

అటవీ సత్యాగ్రహము చేయుగా
పట్టు బట్టినారు
చిటికెలోన ఆ మణిపుర వీరులు
చెట్టా పట్టాల
దట్టిలన్నీ బిగగట్టారు
కట్టుగ నడిచారు
జేజే గాంధి జేజే యనుచు
జేలు మారుమ్రోగ
కత్తులు గొడ్డళ్ళు, ఎత్తి నరికిరీ
నత్తు జూపీ అడవి!

కుక్క కాటుకు చెప్పుదెబ్బ అన్నట్టు చీపురుపుల్లలనుగూడా ముట్టుకోనివ్వక; లేగదూడనుగూడా కాళ్ళాడనివ్వక అడవి





యంతా వీడబ్బసొమ్మనుకొన్న జమీందారీ దివానుకు తగిన శాస్తి జరిగింది.

విజయోత్సాహము మిన్నుముట్టగా
విజయలక్ష్మి తోడ
విజయ సారథులు రైతువీరులు
విజయంబుల సిరుల
జై జై గాంధి జై జై యంటూ
జయఘోషల తోడ
కట్టెలు కొట్టి మోపులు కట్టి
కట్టెబండ్ల నింపి
ఎడ్ల కుప్పె గిగిరెట్ల మ్రోతలు
ఘల్లు ఘల్లుమనగ
పల్లె చేరి ఉల్లాసంబుల ధర
వెల్లువ లుప్పొంగ
గెలుపు మాది యని పులకరించి కో
లాటము లేశారు!

చిలకమ్మ సీరె సింగారించేలోగా పట్టణం మాటుమణిగిందన్నట్టు దివానుగారు తన రథ గజ తురగ పదాతి సేనలను పల్లరించే లోగానే అడవి కొల్లబోయింది.

కన్ను బొడిచెరా దివానుగారికి
చిన్నబోయె ముఖము
మిన్నకున్న తన పన యేముందని
ఉన్నవారిలోనే
ఎన్నికైన తన బంటుల బిలిచి
సన్న దండు జేసి
మిన్నుమన్ను ఏకం జేస్తానని
కన్నుగీటి నడిచె
వెన్ను జూపక కట్టెలన్నిటా
తన్ని తెత్తుననుచు!

ఒట్టి గొడ్డుకు అరుపు లెక్కువన్నట్టు ఈ విధంగా వాగుతూ వెళ్ళాడుగాని అక్కడ వీడి బుడబుడక్కలేమీ వాగలేదు. మొరిగే కుక్క కరవదుగదా? అందుకే మళ్ళీ తిరిగి తన దివాణానికి వచ్చేశాడు.

కలేకట్టురు పోలీస్ మూకల
బలగము దీసుకొని
లతీ, తుపాకులు, బోయినెట్టు చుర
కత్తుల నెత్తుకొని
పందుల్లాగా తిని బలిసిన ఒక
మందను బిలుచుకొని
మణిపుర రైతాంగ వీరులా
మదము సణతునంచు
పల్లెసీమల కొల్లజేయ నా
కల్లను దూరాడు!

నమిలేవాడికంటే మింగేవాడు ఎక్కు వన్నట్టు అసలు జమీందారుతోనే వేగలేక చస్తుంటే ఈ కలెక్టరు బయలుదేరాడయ్యా దొర! ఇక చూడమన్నాడు కలెక్టరు తన దడాఖా, చూచుకో—!

అన్యాయముగా ఏడుమందిని
అరెస్టు జేశాడు
ఏమి న్యాయమని జామీ నడిగిన
ఇచ్చినారు మొదట
కానీ వెంటనె అరెస్టులంటూ
కదం త్రొక్కినారు
జాలిమాలిన తిట్టు రైతుల
తూలనాడినారు
ఖూనీకైనా సిద్ధంబని తమ
పూనిక తెలిపాడు!

ఇంత దౌర్జాన్యానికి దిగిన కలెక్టరును చూచిందే గ్రామస్థులకు రోసం పొంగి పోయింది. ఆ పల్లెటూరి పడతులలో సాసు మాను గున్నమ్మ ఉక్కురోసాలతో ముందుకు వచ్చి నిలబడింది.

సాసుమాను గున్నమ్మ రోసముల
త్రాసులాగ లేచె
మీసాలున్న మొగరాయుల కిది
వీసము సరిగాదు
మోసము జేసి నెత్తురు కుడిచే
దాస్యపు బ్రతుకేల?
కాసు లేదు ఒక కట్టె లేదు అడి
యాసలు మీకేల?
పాశబద్ధులను జేసి రైతులను
తీసుకుపోలేరు.

అంటూ పొలికేక బెట్టి కలెక్టరు కారుకు అడ్డంగా వచ్చి నిల్చుకొన్నది. ఇక కలెక్టరు పూరుకుంటాడా?

కన్ను గీటరా కలెక్టరప్పుడు
కానిస్టేబులును
బోయినెట్టుతో రొమ్మున పొడిచె
బాబు కటికవాడు
గాయము దిన్న ఆడుసింగమై
పోయి రేగె నామె
అంతలోనె ఒక తుపాకిగుండు
గొంతున దూసింది
చిందిన నెత్తురు చిందుతుండగా
ముందు కురికెనండీ!
బహిన్ భళాభళి సోదరీ - సై
బహిన్ భళాభళి చెల్లెలా - సై ॥



చిమ్మే నెత్తురు చిమ్మగా - సై
కుమ్మన రోసము రేగెరా
ప్రళయకాళియై నిలిచెరా
ఆదిశక్తిలా లేచెరా
గొడ్డలి గిరగిర త్రిప్పెరా - కను
గ్రుడ్ల నిప్పులను రాల్చెరా!
సత్యభామలా పొంగెరా
రుద్రమాంబలా లేచెరా
మంటిలో బుట్టిన బిడ్డరా
మంటలై ధగధగ మండెరా!
మింటిలో చుక్కలు రాలె ము
క్కంటి చిచ్చులా లేచెరా....
కంట జూచు యా నీచుల
తుంటరితనముల మాన్పెరా
చలిపెట్టి పాలికేక బెట్టిరా
బలములన్ని మారుమ్రోగెరా!

ఈ విధంగా చెలరేగిన వీరగున్నమ్మను చూచి అధికార్లు భయపడిపొయ్యారు. గడ గడ వణికిపోతున్నారు.

అరెరే పల్లెల పడుచు బాపురే
తరముగాదు నిలుప
రైతువనితరా రణమునందు మన
పతనము దప్పదురా
ఈ తిరుగనే వ్రాసె మృత్యువు
వాత బడగ మనకు
గురితో గుండెకు
సూటిగ రెండు
గుండ్లు వదలమనెరా!

ధణ ధణ ధణ ధణ తుపాకిగుండ్లు
ధాంధామ్మని మ్రోగె
రెండు గుండ్లు ఆ గుండెల దూసె
నిండుతల్లి ఆకటా!
నేల వాలె మన వీరబాల యిం
కేల జీవనాలు
రైతువీరులు రైతుశూరులు
రైతు ధీరులండీ
కత్తి కాళయ నార్ల జగ్గయ
కాలి కూలినారు
దండపాణి నారాయణ వీరులు
విక్రమాలు చిల్క
వీరస్వర్గము నలంకరించిరి
వీరవనితతోనే!

మీసములుంటే చాలదు. రోసము, పరుసముగూడా వుండాలి. ఇంత పట్టుగా పోరాడి ఆనాడు వీరస్వర్గం అలంకరించింది గనుకనే ఆ గ్రామానికి 'వీరగున్నమ్మపుర'మని పేరు పెట్టారు. ఆమెకొక సమాధి నిర్మించి నేటికీ వీరపూజ చేస్తున్నారు. తెలుగు దేశాని కదొక యాత్రాస్థలం గదా! ఆమెతోపాటు స్వర్గసులైన ఆ నలుగురూ చిరంజీవులు గదా!

ఓ వీరగున్నమ్మ
ఓ రైతువీరమ్మ
జోహార్లు జోహార్లు
తల్లీ!
ఓ ధీర రైతాంగనా
వీరదేవతా
జేజేలు జేజేలు తల్లీ!





# మట్టి బుర్ర

పూర్వకాలమందు, బ్రహ్మదత్తుడు కాశీ రాజ్యాన్ని పరిపాలించేటప్పుడు, బోధి సత్త్వుడు ఒక కోతిగా జన్మించాడు. గంగా నదీతీరాన ఒక రావిచెట్టుమీద తన ఉనికి ఏర్పరుచుకొన్నాడు.

నది నిండుగా క్రూరమైనటువంటి మోసకారి మొసళ్ళు ప్రవాహజలంలో విహరిస్తూ వుండేవి.

దుష్టమైన ఇటువంటి మొసళ్లనుగురించి జాగ్రత్తగా ఉండాలనీ, ఎన్నడూ చెట్టు దిగ కూడదనీ, బోధిసత్త్వుడైన కోతి తక్కిన కోతులన్నిటికీ హెచ్చరిక చేస్తూవుండేది.

ఒకరోజున నదిలో వుండే తల్లిమొసలి తన బిడ్డతో "నాయనా!—నాకు ఎంతో కాలంనుంచి కోతిగుండె తినాలనివున్నది. నా కోరిక తీర్చవా?" అన్నది. అందుకు మొసలిపిల్ల 'అమ్మా!—కోతులు చాలా తెలివైనవి. అదీగాక, అవి చెట్టునుండి చెట్టుకు గంతులేసి పారిపోతయి. ఎట్లా పట్టేది?' అని తన సంశయం చెప్పింది. తెచ్చేతీరాలి అని పట్టుపట్టింది తల్లిమొసలి.

మొసలిపిల్ల పోయి రావిచెట్టుకు చుట్టు చుట్టూ తిరిగింది. పైనున్న కోతులు కొమ్మలూ రెమ్మలూ విరిచి దానిమీద పడ వేయసాగినై.

ఉన్నట్టైవుండి, కొన్నికోతులు నీటి సమీ పాన వుండే కొమ్మలకు దిగివచ్చినై. వాటితో పిల్లమొసలి 'వోయి తమ్ముల్లారా!—ఎంతకాలమైనా మీరు ఈ చెట్టుపైన కూర్చొని కాలక్షేపం చేయటమేకాని, ఈ ప్రపంచంలో యెటువంటి చిత్రవిచిత్రా లున్నవో మీకు తెలియదుకదా! ఈ నది మధ్యని పరమసుందరమైన ఒక ద్వీప మున్నది. ఆ ద్వీపంలో చక్కటి మామిడి చెట్టున్నది. రండి నాతో చూపిస్తాను' అని ఎంతో తియ్యగా చెప్పింది.

జాతక కథ



ఈ మాటలు వినేసరికి కోతులకు నోరు ఊరింది. 'ఐతే నేస్తం! మాకు ఈతరాదు. మేము ఎలా రాగలం?' అని అడిగినై.

'అయ్యో, అదీ ఒక సమస్యేనా? రండి. నా వీపుమీద యెక్కకూర్చోండి. మిమ్మలి నందరినీ చిటికెసేపటిలో తీసుకపోయి ఆ తోటలో దిగబెడతా' అన్నది ధీమాగా.

'సరే. మరైతే నన్ను తీసుకువెళ్లు' అంటూ ఒక చిన్నారి కోతిపిల్ల తయారు పడింది. తక్కిన కోతులు వద్దని చెప్పినా అది వినలేదు. 'మొసలి మోసకారి. జాగర్తా!' అని అవన్నీ ఒక్కపెట్టున ఘోష పెట్టాయి. కాని, కోతిపిల్ల తన ఉత్సాహంలో ఈ మాటలు చెవిని పెట్టలేదు. చెప్పలేని సంతోషంతో ఆ పిల్లమొసలి నదిలో ఈదుకు పోతున్నది. అలా పోయి పోయి, గభీమని నీటిలోపలికి మునిగిపోయింది!

అప్పుడు కోతిపిల్ల భయంతో మొసలిని అదిమిపట్టుకొన్నది, చేతులతోనూ, కాళ్ళతోనూ. పైగా ఉక్కిరిబిక్కిరి అయింది.

పిల్లమొసలి మళ్ళీ ఒకసారి పైకివచ్చింది. వొళ్ళంతా తడిసిపోయిన కోతిపిల్ల కళ్ళు తుడుచుకుని, 'మొసలీ మొసలీ! ఎందుకిలా చేశావు?' అని అడిగింది.

'నిన్ను నేను చంపేస్తా...నువు చచ్చేదాకా నిన్ను నీళ్లలో ముంచి వుంచుతా' అన్నది తాపీగా పిల్లమొసలి.

'ఎందుకు నన్ను చంపేది? నువు నాకు నేస్తానివని నమ్మికదా వచ్చాను?' అని ప్రశ్నవేసింది కోతిపిల్ల, అమాయకంగా.

'ఎందుకేమిటి?—మా అమ్మకు ఎన్నాళ్లనించో కోతిగుండె తినాలని అమిత కోరికగా వుందట. నిన్ను పట్టుకపోయి మా అమ్మకు పప్పగిస్తా' అని చెప్పింది.

'ఓయి పిచ్చిఅన్నయ్యా! ఈపాటి మాట ఇందాకనే చెప్పవైతివే! నువు మామిడిపళ్లమాట చెప్పగానే నేను ఉన్నపాటున వచ్చేశాను. నా గుండెకాయ ఆ చెట్టు

మీదనే ఉండిపాయె!' అన్నది. ఈమాటకు అ పిల్లమొసలి కళ్ళు మిటకరిస్తూ, వెర్రిగా చూచింది. 'మరైతే, నీ గుండెకాయ నీతో కూడా ఉండదా?' అని అడిగింది.

'అబ్బే!—శరీరానికల్లా గుండె ముఖ్య మయిందికదా! దాని నెప్పుడూ చెట్టుకు వేలాడదీసి, భద్రంగా కాపాడుకుంటాను. ఎంతో పని వుంటేకాని, పైకి తీసుకురాను' అని చెప్పింది. "నీకు ముఖ్యంగా నా గుండెకాయ అవసరమేఅయితే, మనం మళ్ళా చెట్టుదగ్గరకు పోవాలి. కాని మనం, నువు చెప్పిన ద్వీపందగ్గరకు వచ్చేసి నట్టుందే. నన్నక్కడ దిగబెట్టు. ముందు కాసిన్ని మామిడిపళ్ళు తినివస్తా' అన్నది.

'ఉహుఁ—అలాకాదు. పళ్ళు తరవాత తిందువుగాని. ముందు నాకు నీ గుండె కాయ కావాలి. పద, చెట్టుదగ్గరకు పోదాం' అని తొందరపెడుతూ, గబగబ కోతిపిల్లను తీసుకపోయి చెట్టుకు చేర్చింది పిల్లమొసలి.

కోతిపిల్ల చెంగున చెట్టుమీదికి ఒక్క గంతువేసింది. పైనకూర్చొని కిచకిచ లాడుతూ, 'ఓయి మట్టిబుర్రా!—రా, పైకిరా, నా గుండెకాయ తీసి పట్టుకెళుదువుగాని...' అంటూ వెటకారం చేసి, కొన్ని కొమ్మలు విరిచి పిల్లమొసలిమీద పడవేసింది.



పిల్లమొసలి తనపైన పగపట్టిందని తెలుసు కోతిపిల్లకి. ఈ చెట్టుమీద ఉండటం ఎప్పటికైనా ప్రాణాంతకమేనని తలచి, అది దూరాన వుండే మరొక చెట్టుకు తన బస మార్చింది. ఆనాడుకసిపూనిన అ పిల్లమొసలి ఎలా కనిపెట్టిందో, కోతిపిల్ల బస మార్చటం తెలుసుకొన్నది. సంబరపడి, పగలంతా అది ఆ రేవులోనే కాచుకొని వున్నది.

అక్కడ, నదికి మధ్యని ఒక లంక వున్నది. ఆ లంకనిండా బలేఐన జామి చెట్లు, చెట్లనిండా పళ్ళూ కలకలలాడుతూ, గుమగుమ పరిమళిస్తూఉన్నవి. ఆ లంకకూ నది ఒడుకీ నడుమగా ఒక ఘనమైన

రాతిపలక ఒకటి వున్నది. కోతిపిల్ల చెట్టు మీదినించి లంకకు పోదామనే కుతూహలంతో ఆ రాతిపలకమీదికి ఉరికింది. అక్కడినించి లంకలోకి ఒక్కగెంతువేసి, పొట్ట పట్టినన్ని పళ్లు తిన్నది.

పిల్లమొసలి నదిలోపలే పొంచివుండి, కనురెప్ప వాల్చకుండా చూస్తున్నది. కోతిపిల్ల లంకనుండి తిరిగి వచ్చేటప్పుడు పట్టివేదామని దాని వూహ.

మాటు మణిగింది. కడుపునిండా పళ్ళు దట్టించిన కోతిపిల్ల మెల్లగా లంకనుండి మళ్ళీ రాతిపలక మీదికి దిగింది. ఐతే 'పొద్దుటికంటె ఇప్పుడీ రాతిపలక పెద్దదిగా కనబడుతున్నదే, కొంపదీసి ఏ మొసలయినా ఇక్కడ పడుకోలేదుకదా. ఏమో!—కనిపెట్టడం చాలా కష్టం, అందులోనూ ఈ మసక చీకటిలో...' అని మనసులో అనుమానించింది కోతిపిల్ల. కేకలు పెట్టింది. అనుకొన్నట్టుగానే, కొంతసేపటికి మొసలి కదిలి, నోరుతెరిచింది. 'ఆసి, నీ దుంపతెగా!—తలచినంతా అయిందే! సరే. ఇంకిప్పుడు యెలాగో నీ బోనులో చిక్కుకొన్నాను. తెరు, నీ నోట్లోకి ఉరుకుతా...' అన్నది కోతిపిల్ల.

మొసలి నోరు తెరిచినప్పుడు కళ్ళు మూసుకుంటుంది. ఈ కీలకం తెలుసు కోతిపిల్లకు.

సంతోషంకొద్దీ పిల్లమొసలి నోరు తెరిచింది. అంటే కళ్లు మూసుకున్నదన్నమాట. కోతిపిల్ల యెగిరి గంతేసింది. ఎక్కడికి? మొసలి నోట్లోకి కాదు! దాని బుఱ్ఱమీదికి. పిల్లమొసలి బుఱ్ఱమీదినించి ఒక్క ఊపుతో అది తన చెట్టుమీదికి ఉరికి, క్షేమంగా కొమ్మమీద కూర్చుంది.

తెల్లబోయిచూచింది పిల్లమొసలి. 'ఓసీ, మట్టిబుఱ్ఱా!—నీవేనా నామీద పగపట్టడం?' అని కిచకిచలాడుతూ చిటారుకొమ్మకంటా వెళ్లిపోయి వెక్కిరించింది కోతిపిల్ల.





# మామూలు

కరణం భీమరాజుగారంటే అగ్రహారంలో అందరికీ హడలే. పెద్ద ఉద్యోగస్థులు సైతం భీమరాజు పేరు చెబితే జడుస్తారు.

ఆ వూరికి ఒకసారి ఒక గొప్ప జ్యోతిష్ఠుడు వచ్చాడు. ఊళ్ళో పెద్దలందరికీ జాతకాలూ, హస్తాలూ చూచి చెప్పి, ఏవో బహుమతులు తెచ్చుకొన్నాడు. చివరికి, ఊళ్లో కరణంగారి దర్శనానికి వెళ్ళాడు.

కరణంగారు అరుగుమీద కూర్చొని, లెఖ్కలు వ్రాసుకొంటున్నారు. 'నమస్కారమండీ బాబూ!' అన్నాడు జ్యోతిష్కుడు.

'దయచేయండి, దయచేయండి!' అన్నాడు ఠీవితో కరణం భీమరాజు, చేతిలో కలం కిందపెట్టుతూ. కుశలప్రశ్నలయినై. జ్యోతిష్కుడు తను వచ్చిన పని చెప్పి, కరణంగారి హస్తం చేతపుచ్చుకొని అపరిమితమైన ఆసక్తితో ప్రారంభించాడు: "ఆహాహా, భలే జాతకం కదండీ! శని ఏడింట ప్రవేశించడంతో తమరు ప్రభువులయ్యారు. సార్వభౌమపదవి అలంకరించవలసిన దివ్యజాతకం. అందుకనే మన గ్రామానికి తమరు కేవలమూ మకుటం లేని మహారాజులయ్యారు!–" అంటూచెప్పాడు.

చూడటం అంతా అయింతరువాత, "సరి, హస్తసాముద్రికానికి మీ మామూలెంత?" అని అడిగాడు కరణం భీమరాజు.

"దానికేముందండి? ఎవరి సంతోషం కొద్దీ వారు ఇస్తారు. లేనివాళ్ళు కూడా నాలుగు రూపాయిలు తక్కువ లేకండా ఇచ్చారు. ధర్మప్రభువులు. గ్రామానికి మహారాజులు! తమదగ్గర బేరాలేమిటి?" అన్నాడు జ్యోతిష్కుడు.

"మరి, మునిసీబుగారూ, వెలందొర పుల్లయ్యగారూ, చిన్నపరాజుగారు—పెద్ద పెద్దలంతా వున్నారుకదా! చూడలేకపోయారూ?" అన్నాడు భీమరాజు.

కుమారి శారద

"క్షమించాలి. ముందుగా వారిని చూచుకునే వచ్చానండి, వచ్చేదారిలోనే కదా అని" అన్నాడు జ్యోతిష్కుడు.

"మరైతే, వసూలు ఏమాత్రం?" అని మళ్లీ ప్రశ్నించాడు కరణం.

'అయ్యా! నెలా పదిహేను రోజుల నుంచీ ఈ అగ్రహారం చుట్టుపక్కలే సంచారం చేస్తున్నాను. నిజానికి, ఈ గ్రామాలన్నీ లక్ష్మికి నివాసాలే. అందులోనూ మన గ్రామంలో ఆదరణ మరీ ఎక్కువ. విద్యలు పోషించే మహాదాతలంతా ఇక్కడనే వున్నారాయె...' అన్నాడు.

'అదేనయ్యా, నీకు పదిరాళ్ళు దొరికినవీ అంటే మాకదే సంతోషం. మా గ్రామానికి ఎవరైనా మీవంటి విద్వాంసులు వచ్చారంటే ప్రోత్సాహమివ్వాలికదా!' అన్నాడు కరణం.

పొంగిపోయాడు జ్యోతిష్కుడు. 'దాపరికమెందుకు బాబూ? సుమారు రెండువందలు వసూలుంటుందండి' అని చెప్పాడు.

భీమరాజు చిరునవ్వు నవ్వుతూ, "భేష్! చెప్పావు కావేమయ్యా, పిడుగ!—అలైతే మీరు చెప్పిన మొత్తంమీద రూపాయికి అయిదు దమ్మిడీలు చొప్పున వచ్చే ఐదు రూపాయిల పావలా, కరణం మామూలు ముందు జమకట్టండి. మామూలు కట్టాలన్నది చిన్న పిల్లవాడికికూడా తెలుసునే! ఇందులో మీ మామూలు నాలుగు రూపాయలు మినహాయించుకొని తక్కిన రూపాయిపావలా కట్టెయ్యండి. తీరిపోతుంది' అన్నాడు.

బిత్తరపొయ్యాడు జ్యోతిష్కుడు. కరణం బాబుదగ్గిర వుంటే ఇంకా యేం ప్రమాదమోనని హడలుతూ, అతను రూపాయ పావలా వెంటనే కట్టేసి, కిక్కురుమనకుండా అక్కడనుండి వెళ్ళిపోయాడు.

నాటినుంచీ ఆ జ్యోతిష్కుడు ఎవరికైనా చేయిచూచేవాడు కాని, కరణం అని తెలిస్తే మటుకి ఆమడదూరాన ఉండేవాడు.






# వింత వైద్యశాల

చంద్రనగరానికి రాజు ఆనందగజపతి. ఆయన మంత్రి స్థిరబుద్ధి. స్థిరబుద్ధి మిక్కిలి తెలివిగలవాడు. అతని తెలివితేటలవల్లనే రాజ్యంలోని ప్రజ సుఖంగాను, ఎంతో ఆనందంగాను ఉండేవారు.

ఒకప్పుడు గజపతికి గుండెజబ్బు చేసింది. ఘన వైద్యులంతా ఆశ వదులుకొన్నారు. చివరకు రామయ్య అనే పల్లెటూరి వైద్యుడు వచ్చి, రాజుగారి జబ్బును మూడురోజులలో కుదిర్చివేశాడు. రామయ్య సమర్థతకు మెచ్చి, రాజు అతనిని తన ఆస్థాన భిషగ్వరునిగా నియమించాడు. నాటినించీ రామయ్యకు పేరుప్రతిష్ఠలు పెంపొందసాగినై.

కొన్నిరోజులకల్లా కోటలో రాణిగారికి జబ్బుచేసింది. అప్పుడుకూడా రామయ్య అదృష్టంవల్లనైతేనేమి, రాణికి ఆయుర్దాయం బాగుండటంవల్లనైతేనేమి, జబ్బు నయమై రామయ్య మందువల్ల రెండునెలలలో పూర్తిగా కుదిరిపోయింది. అంతటితో రామయ్యకు యిదివరకు ఇచ్చే జీతానికి రెట్టింపు మంజూరుచేశాడు రాజు.

పల్లెటూరి వైద్యుడైన రామయ్యకు ఇంత శీఘ్రకాలంలో పేరు ప్రఖ్యాతులు, ధన సంపదలు కలగటంవల్ల, అతనికి గర్వం హెచ్చింది. ఎవరినీ లక్ష్యంచేయని రోజులు వచ్చాయి. 'రాజుగారిని, రాణిగారిని మృత్యువునుంచి కాపాడిన దేవుడను నేను' అని బడాయిలు కొట్టుతూఉండేవాడు.

ఇదివఱకు ప్రతిరోజూ రాజ వైద్యశాలకు వెళ్లి, రోగులను పరీక్షచేసి మందులిచ్చే రామయ్య, రానురాను తన ఇష్టం వచ్చినప్పుడే వైద్యశాలకు వెళ్ళటం మొదలెట్టాడు. నెలనెలా వైద్యశాలమీద వినియోగించమని రాజు ఇచ్చే అయిదువందల రూపాయిలూ మందులు కొని, వాటిని వైద్య

కొప్పాక వెంకటేశ్వరరావు




శాల రోగులకు వాడక, యింటికి వచ్చిన రోగుల కిచ్చి, వాళ్లవద్ద డబ్బు తీసుకోవడం ప్రారంభించాడు.

కొంతకాలమయేసరికి, వైద్యశాలలో వున్న రోగులందరూ రామయ్యమీద రహస్యంగా రాజుగారికి అర్జీ పెట్టుకున్నారు. అర్జీని రాజు తన మంత్రికి చూపించాడు. ప్రథమ తప్పిదం కాబట్టి మంత్రి, కొన్నాళ్లు చూద్దామని రామయ్యమీద యేమీ చర్య తీసుకోకుండా ఊరుకున్నాడు.

కొన్నాళ్ళయిన తరువాత రామయ్య తనకు ఇచ్చే నెలజీతం చాలటంలేదనీ, తన వైద్యశాలలో ఇదివఱకు వచ్చే రోగుల సంఖ్యకు యిప్పుడు నాలుగురెట్లు హెచ్చి నందువల్ల రోగులకోసం వినియోగించమని ఇచ్చే డబ్బు నాలుగురెట్లు హెచ్చించితేగాని, వైద్యశాల నడపటం కష్టమనీ, దరఖాస్తు పెట్టుకొన్నాడు.

'వైద్యశాల ఖర్చుకు డబ్బు ఎక్కువ కావాలి' అని వచ్చిన దరఖాస్తు చూచి, రాజు చాలా కోపగించాడు. మంత్రీ, తనూ వైద్యశాలకు వెళ్లి స్వయంగా అక్కడి పరిస్థితులు చూడాలని అనుకొని, వారం రోజులకు ముందుగానే రామయ్యకు ఈ సంగతి తెలియబరిచారు.

రాజూ, మంత్రీ రేపు వస్తారనగానే, అది వఱకు బహుకొద్ది రోగులే వున్న వైద్యశాల ఇప్పుడు, ఎలానో అనేకమంది రోగులతో నిండిపోయింది.

వస్తానన్న రోజున ఉదయమే మంత్రితో సహా వచ్చి, రాజుగారు వైద్యశాల ముందు గదిలో కూర్చున్నారు. మందుల ఖర్చులు, రోగుల సంఖ్యలు గల పట్టికలు తనిఖీ చేస్తూ, రామయ్యను రాజుగారు గాఢమైన ప్రసంగంలో పెట్టి వుంచారు. రామయ్య తన జీతం అభివృద్ధికోసం, వైద్యశాలకు ఎక్కువ డబ్బు మంజూరు చేయగలందు లకు రాజుగారికి అనేకవిధాలుగా నచ్చ




జెప్పుతూవున్నాడు. రాజు వింటూఉన్నాడు. రాజుగారూ, రామయ్యా దీర్ఘ సంభాషణలో వుండటం గ్రహించి, ఇదే సమయమని మంత్రి లోపల హాలులో వున్న రోగుల మంచాలవద్దకు వెళ్లాడు. రామయ్య చేసిన కుట్ర ఇట్టె తెలుసుకున్నాడు మంత్రి. తగిన శాస్తి చేయాలని నిశ్చయించుకొన్నాడు.

మంత్రి మొదటి మంచందగ్గరకు వెళ్ళి, "నీ జబ్బేమిటి? నీవు యింకా యెన్నాళ్ళు యిలా బాధపడతావు? నేనొక రామబాణం లాంటి ఔషధం ఇస్తాను, పుచ్చుకుంటావా" అని అడిగాడు రోగిని.

వెంటనే రోగి "అంతకన్నానా బాబూ! ఇవ్వండీ" అని దీనంగా వేడుకున్నాడు. అప్పుడు మంత్రి "ఇది పరమ రహస్యం. ఎవ్వరికీ చెప్పనంటే, నీకది చెపుతాను" అన్నాడు. అందుకు రోగి, "నే నెవ్వరితోనూ చెప్పను" అని అంటూ మంత్రి చేతిలో చేయి వేశాడు. అప్పుడు మంత్రి "నాకీ చికిత్స ఒక సిద్ధుడు చెప్పాడు. అతడు హిమాలయా పర్వతాలమీద తన జీవితమంతా తపస్సు చేసి, ఫలితంగా ఈ విద్యను సాధించి, అతడు చనిపోయేముందు, ఈ రహస్యాన్ని నాకు వెల్లడించాడు" అని ఊరుకున్నాడు. "అదేమిటో సెలవిప్పించండి బాబూ!" అన్నాడు ఆత్రంతో రోగి. అందుకు మంత్రి— "మీలో బాగా ఎక్కువ జబ్బుగా ఉండి, యిక ఎలాగా బతకడని అనుకునే రోగిని చంపివేసి, వాడిని కాల్చి, ఆ కాల్చిన బూడిదను, అనగా భస్మాన్ని తేనెలో కలిపి, మూడు రోజులు సేవిస్తే, సకల విధములైన రోగాలూ వెంటనే మాయమైపోతయి. మనిషి జబ్బుకు మనిషే మందు! కాని అలా చనిపోవటానికి సిద్ధంగా ఉండే రోగి ఇక్కడ ఎవడు ఉన్నాడు అనేదే ఇప్పుడు ప్రశ్న. అటువంటి త్యాగిని ఎంచుకోవటానికని మీ వైద్యుడు రామయ్యే గుమ్మందగ్గర నిలబడి "రోగంలేనివాళ్ళు అందరూ బైటికి

వచ్చేయండి" అని పిలవటానికి వప్పుకొన్నాడు. అతడు పిలిచినప్పుడు రాకుండా వుండే మిగిలిన వానిని..." అని మళ్ళీ పూరుకొన్నాడు మంత్రి.

అందరి రోగులవద్దకూ వెళ్లి, మంత్రి యిదేప్రకారం ఉపదేశించాడు. రోగులందరూ ఆ సిద్ధుని దివ్యౌషధం పుచ్చుకొనటానికి ఇష్టపడ్డారు. అందరినీ ఒప్పించిన తరువాత మంత్రి రాజుదగ్గిరవున్న వైద్యుని వద్దకు వచ్చాడు.

"రామయ్యా! రాజుగారు రోగులను స్వయంగా చూద్దామని వస్తే, వారితో నీవే ఎక్కువసేపు మాట్లాడావు. రోగులనందరినీ చూచి పలకరించటానికి వారికి వ్యవధి యేది? పైగా రోగులవద్ద ఎంతోమంది వాళ్ళ బంధువులు ఉన్నట్టున్నారు. కాలాతీతమైంది. అందుకని నీవు గుమ్మంలో నించుని 'రోగం లేనివాళ్లందరూ బైటికి వచ్చేయండి' అని అందరూ వినేట్టుగా కేకపెట్టితే, జబ్బు ఉన్నవాళ్ళే లోపల ఉండిపోతారు. లేనివాళ్లు బైటికి వచ్చేస్తారు. అప్పుడు లోపల వున్న రోగులను చూచి, మీ జీతంమాట రాజుగారు ఆలోచిస్తారు" అని చెప్పాడు.

మంత్రి సలహాకు వైద్యుడు సమ్మతించాడు. ఆ ప్రకారం రామయ్య "జబ్బు లేని వాళ్లందరూ బైటికి వచ్చేయండీ!" అని అందరూ వినేట్టుగా కేకవేశాడు.

కేక వినబడిన పది నిమిషాలలోగా ఒక్కరూ లోపల ఉండకుండా రోగులందరూ హాలుబైటికి వచ్చేశారు.

అప్పుడు మంత్రి రాజుతో "ప్రభూ! రోగం లేనివాళ్లందరు బైటికి వచ్చేశారు. ఇక రోగులెవరో లోపలికి వెళ్లి మనం లెక్కపెడదాం" అన్నాడు.

రాజు, మంత్రి, వైద్యుడు హాలులోకి వెళ్లి చూస్తే, యేపక్కమీదగాని ఒక్క రోగి ఐనా కంటికి కనబడితేకదా!






## 3

[కుండలినీ సైన్యాలతోవున్న ఓడలు తుపానుగాలిలో చిక్కి, చెల్లాచెదురయినై. సమరసేనుడు కొంతమంది సైనికులతో ఒక భయంకర ద్వీపం చేరుకొన్నాడు. అక్కడ వింతజంతువుల పోరాటంచూచి హడలిపోయి అంతా చెట్లెక్కారు—తరువాత]

సమరసేనుడూ, అతని సైనికులూ చెట్ల కొమ్మలలో దాగి, ఆ వింతజంతువుల భయంకర పోరాటాన్ని తిలకిస్తూవున్నారు. ఆ సింహాల పాలబడిన ఏనుగు వాటి బారి నుండి యెలాగ తప్పుకొనిపోవటమా అని ఆరాటపడుతున్నది.

అప్పుడు ఒక సైనికుడు ముందుకు వచ్చి "సేనానీ!—తీరని చిక్కులో పడ్డాము. భయం కొలిపే ఈ ద్వీపాన్నుంచి మనం దోచుకుపోగలిగిన ధనరాసులేమున్నయి ?" అని అడిగాడు సమరసేనుణ్ణి.

మరొక సైనికుడు అందిపుచ్చుకొని, 'ప్రాణాలతో ఇక్కడినుండి బయటపడితే అదే పదివేలు' అని జవాబిచ్చాడు.

ఆలోచనలో పడ్డాడు సమరసేనుడు. 'లోకమంతటా ప్రజలు నాగరికులై, చక్కటి జీవితాలు గడుపుతున్న ఈనాడుకూడా, ఈ ద్వీపవాసులింకా రాతియుగంనాటి దశలోనే వున్నారని స్పష్టపడుతున్నది. ఇక్కడ ఒక రాజు అనీ, పరిపాలన అనీ ఉన్నాయో, లేనే లేవో! అటువంటప్పుడు యిక్కడ ధనం లభించేదేమిటి ?' అని అనుకొన్నాడు.



ఇలా సమరసేనుడు ఆలోచించేటంత లోనే ఆ అరణ్యమంతా ప్రతిధ్వనించేటటు వంటి ఒక కంఠస్వరం వినబడింది:

"హేయ్, కాలభుజంగా! కంకాళా! రండి, రండి! ఆ చతుర్నేత్రుణ్ణి వెతికిపట్టి హతమార్చండి!!" అనే ప్రళయ భీకర నాదం దశదిశలా వ్యాపించింది.

ఇది విని సమరసేనుడి గుండె ఆగినంత పని అయింది. చెట్టుకొమ్మలలో దాగివున్న అతను గజగజలాడిపోయాడు. ఆ భీకర నాదం వింటూనే, దిగువ కొలను సమీపంలో వున్న జంతువులూ, చెట్లపైనున్న నర వానరాలూ చెల్లాచెదరై పారిపోయినై.

అంతలో ఆ కొలను గట్టున—

తాటిచెట్టంత పొడవాటి వ్యక్తి: అతనిది ఒంటికంటి చూపు! అతని రెండు కాళ్ళను చుట్టేసి, కోరలు చాపి, ముందుకు ఉరుకు తున్న కాలసర్పం. వెనుకవైపున వాని తలకు మరింత ఎత్తులో కదులాడుతూవున్న ఒక మనిషిపుర్రె! ఆ పొడవాటి ఒంటికంటి వాడు కొలనుగట్టునే నిలబడి, చుట్టూ పరి కించి తలపంకిస్తూ—

"హేఁ!—మంత్రాలదీవి - జిల్లేళ్ళదిబ్బ - పల్లేరుకొండ - కొండ కొసని బండ! ఆ బండ మీద నించుని చూస్తే ఏమిటి కనపడుతుంది





కంకాళా?" అని హుంకరించాడు. అందుకు జవాబుగా, ఆ మనిషిపుర్రె వికటాట్టహాసంతో నవ్వుతూ—

"నట్టనడిసముద్రాన నాట్యమాడే నావ. నావలోపల ధనరాసులు. నావకు బయట కాపలా కాసే నాగకన్య. నాగకన్యను హతమారిస్తే సరి—నావనిండుగా వుండే ఆ ధనరాసులన్నీ మనవే!" అని చెప్పింది.

"అవును! ఇంత సాధించగలిగితే ధనమంతా మనదే. కాని, చూడూ:—ఆ చతుర్నేత్రుడు...హాఁ!!" అంటూ మళ్లీ హుంకరించాడు ఒంటికంటివాడు.

చెట్టుపైనే కూర్చుని, ఈ సంభాషణ అంతా వింటున్న సమరసేనుడికి ఒకవంక భయమూ, మరొకవంక ఆశ్చర్యమూ ఒక్కసారిగా కలిగినై. ఇప్పుడు తను ఉన్నది మంత్రాలదీవి అనీ, ఆ దీవిలో ఒకానొక కొండకొసని గల బండపైన నిలబడి చూస్తే సముద్రంలో ధనరాసులతో నిండివున్న నావ కనబడుతుందనీ అతను గ్రహించాడు.

ఐతే—ఆ చతుర్నేత్రు డెవరు? భయంకరాకారుడైన ఈ ఒంటికంటి మంత్రవేడికీ అతనికీ మధ్యని శతృత్వం ఎందుకు వచ్చింది? ఆ శతృత్వానికి నావలోని ధనరాసులే కారణమా, మరేదైనానా?




సమరసేనుడు ఇలా ఆలోచిస్తూవున్నంతలో, భయంకరాకారుడైన ఆ మంత్రవేది కొలనుగట్టు దిగి అడవిలోకి వెళ్లిపోయాడు. అతని వెంబడే కాలసర్పమూ, ఆ వెనకనే మనిషిపుర్రేకూడా వెళ్ళినై.

ఇంతవరకూ గజగజ వణికిపోతూవున్న సైనికులు ఆ ఏకాకి వెళ్లిపోగానే కాస్త తెప్పరిల్లారు. అందరూ సమరసేనుడికేసి చూచారు. అందరి ముఖాలలోనూ భయచిహ్నాలు కనిపిస్తూనే వున్నయి.

సైనికులలో ఒకడు తడబడుతూ: 'ఈ ఏకాకి గొప్ప మంత్రవేత్తలా ఉన్నాడు. వానిని వెంబడించే కాలసర్పమూ, మనిషి




పుర్రే ఎంతటి ధైర్యశాలికైనా భీతి కలిగించే తీరుతై. ఇటువంటి ద్వీపాన్ని ఎంత త్వరగా వదిలితే అంత మేలు ' అన్నాడు.

ఇందుకు సమరసేనుడు ఏమని సమాధానం చెబుతాడోనని సైనికులందరూ చెవులు రిక్కించి నిశ్శబ్దంగా కూర్చున్నారు. కాని, సమరసేనుడు కాస్సేపు ఆగి—

"ఇంతటి భయంకర దీవిలోనూ మనకు ధనం లభించే అవకాశాలు కనబడుతున్నాయి. పోతే, కావలసిందల్లా కష్టాలను సహించే శక్తీ, గుండెనిబ్బరమూ" అన్నాడు.

ఇలా అంటూనే, సమరసేనుడు చెట్టు మీదినించి కిందికి దిగాడు. సైనికులూ దిగి



వచ్చారు. 'ఇక, ముందుకథ యేమిటి ?' అనే ప్రశ్న ప్రతి సైనికుణ్ణీ కలవరపెట్టింది. నిర్ణయం సమరసేనుడిదే కనుక, అందరూ అతనివైపే చూడసాగారు.

"విన్నారుకదా, '...పల్లేరుకొండ, కొండ కొసని బండ...' అని ఆ ఒంటికంటి మాంత్రికుడు చెప్పిన మాటలు ? ఆ కొండ, కొండ కొసని బండ ఎక్కడ వున్నదీ కనిపెట్ట గలిగితే, మనం వచ్చిన పని చాలవరకు నెరవేరినట్టే !" అన్నాడు సమరసేనుడు.

ఈ మాటకు సైనికులలో ఒకడు సందేహిస్తూ "ఆ మాంత్రిక ఏకాకి చెప్పిన మాటలలో వాస్తవం ఉన్నదంటారా ?" అన్నాడు.

ఇందుకు వెంటనే సమరసేనుడు ఇలా బదులుచెప్పాడు :

"మాంత్రికుడు అడిగిన ప్రశ్నలోనూ, బదులుగా ఆ మనిషిపుర్రె చెప్పిన జవాబులోనూ అబద్ధం ఏమీలేదు. పోతే—ధనంతో నిండిన నావను ఒకానొక నాగకన్య రక్షిస్తున్నదని వాళ్ళ సంభాషణబట్టి తెలుస్తుంది. అదీగాక—'చతుర్నేత్రు' డనే మరిఒక మంత్రవేత్త వాళ్ళకు బద్ధశత్రువై ఉన్నట్టు కూడా మనం నమ్మవచ్చు. ఐతే, ఇన్ని ప్రతిబంధకాలనూ దాటుకొనిపోయి, ధనరాసులతో నిండివున్న ఆ నావను మనం



పట్టటం ఎలాగా అనేదే ఇప్పుడు మనకు పట్టుకొన్న సమస్య !"

ఈ సమస్యకు జవాబివ్వటానికి సైనికులలో ఒక్కడికీ గుండెధైర్యం చాలింది కాదు. ప్రయాణానికి బయల్దేరినప్పుడు బెదరిపోయిన సైనికులందరకూ, ఇప్పుడు సమరసేనుడు చెప్పిన మాటలు మరింత బెదరు పుట్టించినై.

ఉన్నచోటునించి ఒక్కమారు చుట్టూతా కలయజూచాడు సమరసేనుడు. మెలకువతో, జాగ్రత్తగా ముందుకు నడవసాగాడు. అతనిని అనుసరించారు సైనికులు.

అలా వృక్షాలు దాటుకొని కొంచెందూరం పోయేసరికి, గూబలు బద్దలుగొట్టేటటువంటి ఒక అరుపు చెవినిపడింది.

ఇదేమిటా అని సమరసేనుడు అనుకొంటూవుండగానే, బ్రహ్మాండమైన ఒక కారునల్లటి గుడ్లగూబ వారి తలపైనుంచే ఎగిరిపోసాగింది. ఆ గూబ మానవస్వరంలో కఠోరంగా—

"చతుర్నేత్రా! చతుర్నేత్రా !!—నరమానవులు—నరాధములు! నరమానవులు—నరాధములు !! బహుపరాక్ !!" అని అదేపనిగా హెచ్చరిస్తూ, యెగురుతున్నది. ఆ భీకరరూపంలో వున్న గూబనూ.






మానవస్వరంలో పలికే దాని హెచ్చరికనూ విని, సమరసేనుడూ సైనికులూ నివ్వెర పోయారు. 'పక్షులచేత మానవభాష మాటా డింపగల మాంత్రికుడు మరి ఏ కార్యం మటుకు సాధించలేడు?'—ఇలా అనిపిం చింది వాళ్ళందరికీ.

దీనికే నివ్వెరపాటు చెందిన మన సమర సేనుడికీ సైనికులకూ దిగ్భ్రమ కొలిపే మరి వక వింతదృశ్యం కంటబడింది—అది ఒక వానరం. కాదు, సగభాగం నరుని ఆకృతి గల ఒక 'నరవానరం.' అది గభీమని చెట్టుపైనుండి దిగింది. ఇంతవరకూ ఆకా శాన ఎగురుతూ హెచ్చరికలు పలుకుతున్న నల్లగూబ ఆ నరవానరం బుజంమీద వాలి, దాని చెవిలో ఏదో రహస్యం చెప్పింది!

ఆ నరవానరం ఒక్కమారు వెనక్కు తిరిగింది. సమరసేనుణ్ణీ సైనికులనూ చూచింది. చెట్లకు వేలాడే తీగల ఆధా రంతో, ఒక చెట్టుపైనుంచి మరొక చెట్టుపైకి దూకుతూ, క్షణంలో అదృశ్యమయింది!

"సేనానీ!—ఇక మనం వెనుదిరగటమే మంచిది. ఈ మంత్రాలదీవిలో మనం సాధించగలిగింది యేమీ లేదు. పక్షులనూ జంతువులనూ వేగులుగా ఉపయోగించుకో గలిగిన మాంత్రికుల శక్తిముందు మన కత్తులూ బాణాలు ఏం వుపయోగిస్తాయి? చాలు. వెనక్కు తిరగండి!" అని ఒక సైని కుడు సమరసేనుణ్ణి వేడుకొన్నాడు.

విని విననట్టు ఊరకొన్నాడు సమర సేనుడు. ఎదట, చెట్టుమీది ఆ గుడ్లగూబ, చింతనిప్పులవంటి దాని గుడ్లు అటూ ఇటూ తిప్పుతూ, అంతా పరికిస్తూనేవుంది.

ఉన్నట్టేవుండి, ఏదో హఠాత్తుగా ఉపాయం తట్టినవాడిలాగా సమరసేనుడు, పక్కనున్న సైనికునివద్ద విల్లంబు అందు కొని, బాణం ఎక్కుపెట్టాడు.

వెంటనే ఒక సైనికుడు "సేనానీ!— ఆ మంత్రశక్తి గల పక్షిపైన మన బాణాలు

పనిచెయ్యవు. పైగా మన మీద మాంత్రికుడికి కోపం వస్తుంది. ఆలోచించండి!" అని తన అభిప్రాయం చెప్పాడు.

సమరసేనుడు చిరునవ్వు నవ్వుతూ—"అదీ తేలుద్దాం. ఇంత దూరం వచ్చిన తరువాత ఆగటమేమిటి? మన బాణం సత్తువ ఎంతటిదో పరీక్షిద్దాం...!" అన్నాడు.

ఇలా అంటూనే సమరసేనుడు గురి చూచి బాణాన్ని ఆ చెట్టుమీది గుడ్లగూబ మీదికి వదిలాడు. బాణం రివ్వుమని పోయి సూటిగా గూబను తాకింది. అయితే—దెబ్బతో అది గిలగిల తన్నుకు కిందపడు తుందని అనుకొంటూవున్న సమరసేనుడికి మాత్రం చెప్పలేని ఆశాభంగం కలిగింది.




రెక్కలో గుచ్చుకొన్న బాణాన్ని తన ముక్కుతో అవలీలగా లాగిపారేసింది ఆ గూబ. పారవేసి ఇలా పలికింది కఠోరంగా:

"నరాధములు!—మీరా నన్ను చంపటం? ఘనమైన మాంత్రికుణ్ణి అనుకొని గర్వపడే ఆ ఏకాకికే నేను దుర్లభమై పోయాను. అటువంటిది మీరెంత? మీ బాణాలెంత?—ఉండండి, ఉండండి. నిదానించండి కొంచెం! మా చతుర్నేత్రుడు వచ్చి మీ నెత్తుర కళ్ళజూచే శుభసమయం దగ్గర పడుతున్నది..." అంటూ, మళ్ళీ మానవబాషలో ఉగ్రాన్ని వెలిబుచ్చింది.

ఇప్పుడు ఈ గూబమాటలతో సమరసేనుడికి—తనూ, తన సైనికులూ ఎంతటి ప్రమాద పరిస్థితులలో చిక్కుకొన్నదీ అర్థమైంది. తక్షణమే సైనికులను హెచ్చరించాడు. హెచ్చరించి తను పరుగుచ్చుకొన్నాడు.

కాని, పైన చెట్లమీదినించి అంచీలపై ఎగురుతూ, ఆ భయంకరమైన నల్ల గుడ్ల గూబ అతనిని వెంబడిస్తూనేవుంది. ఎలా ఐనా సముద్రతీరం చేరుకొని, పడవ యెక్కి పారిపోదామని సమరసేనుని ఆరాటం. ఆ ఆరాటంలో, దోవతప్పి అల్లాడసాగాడు. బాగా ఒక గంటసేపు అలా దారీ తెన్నూ



తెలియకుండా కొట్టుమిట్టాడిన తరువాత గాని, తను దారి తప్పినట్టు సమరసేనుడికి అర్థంకానేలేదు. అలా అని, ఒకచోట స్థిరంగా నించుని ముందుసంగతి ఆలోచించు దామా అంటే, అందుకూ వీలులేదు. గడ్లగూబ ఒకవంక వానినీ సైనికులనూ వెన్నాడుతూనేవుంది.

ఆలోచనకు ఏమీతోచక, సమరసేనుడు అక్కడ ఒక చెట్టుకు ఆనుకొని నిలబడి పోయాడు. తలలువాల్చిన సైనికులు చుట్టూ మూగారు. వారిలో ఒక్కళ్ళకూ ఏమీ పాలుపోలేదు.

"మనం దారితప్పాం. అందుకు తోడు, ఈ దీవిలో ఉండే ఒకానొక మాంత్రికునికి కూడా విరోధులమయ్యాం. ఇప్పుడు చేయ గలిగింది ఒక్కటే. మన కుండలినీదేవిని ప్రార్థించటం!" అన్నాడు సమరసేనుడు.

"ముందుగా ఆ నల్లగూబ సంగతి చూడండి. దాని దృష్టినుంచి తప్పుకొని పోయామంటే మనకు అన్నివిధాలా క్షేమమే!" అన్నాడు ఒక సైనికుడు.

సరిగా అదే సమయానికి మళ్ళీ, అరణ్య మంతా ప్రతిధ్వనించేటటువంటి ఒక కంఠ స్వరం వినవచ్చింది. ఈ స్వరం మాంత్రికు డైన వికాకిది—

"కాలభుజంగా! కంకాళా!!..."

ఈ పిలుపు వినబడటమే తడవుగా, చతుర్నేత్రుని 'వేగు' అయిన నల్లగూబ చెట్టుపైనుంచి అరుస్తూ ఎగిరిపోయింది. 'గూబ పీడ పోయింది. బయటపడ్డాం...' అనుకొని సంతోషిస్తూవున్న సమరసేనుణ్ణీ, సైనికులనూ మరొకవైపునుంచి వికాకి కంఠస్వరం భయకంపితులను చేసింది. క్షణమైనా ఆగక, ఆ చెట్లమాటునుండి వారు కాలికొద్దీ పరుగెత్తసాగారు.

—(ఇంకా వుంది)






సుమారు నాలుగువందల సంవత్సరాల క్రిందట, మైసూరు ప్రాంతంలో ఒక రాష్ట్రాన్ని పురుషోత్తముడనే రాజు పాలించుతూ ఉండేవాడు. ఆయన గంగవంశానికి చెందినవాడు. గౌరవనీయుడైన ప్రభువు. అవివాహితుడు. తనకు తగిన కన్య దొరికితే తప్ప పెళ్ళాడనని పట్టుదల వహించాడు.

ఆ కాలంలో, కాంచీపురాన్ని ఏలే 'కంచి రాజు'కు ఒక కుమార్తె ఉండేది. ఆమె లోకైకసుందరి అని పేరు పొందింది. పురుషోత్తముడికి ఈ కన్య అన్నివిధాలా తగినదని లోకంలో ఒక వదంతి బయల్దేరింది.

ఈ వార్త పురుషోత్తముడి తండ్రికి చేరగానే, ఆయన కంచిరాజుకి పురోహితుని ద్వారా రాయబారం పంపించాడు. పెళ్ళి చూపులకు ఏర్పాటుకూడా జరిగింది. కంచి రాజు వారికి సమస్తమైన మర్యాదలూ జరిపించి, తనకు కావలసిన భోగట్టాలన్నీ తెలుసుకొన్నాడు.

పురుషోత్తముడు గొప్పవంశానికి చెందిన యువకుడు. మంచి విద్యావంతుడు, శక్తి సామర్థ్యాలు కలవాడు. ఇన్నిటికీ మించి ఉన్నతమైన అంతస్థు కలిగినవాడు. పైగా ఆ సమావేశంలో పురుషోత్తముడూ కంచి రాజు కూతురూ ఒకరినొకరు చూచుకొని మనసులో ఇష్టపడ్డారు.

ఇన్ని విధాల అనుకూలంగా ఉండే పురుషోత్తముని సంబంధం కంచి రాజుకు బాగా నచ్చింది. అందుచేత, ఖాయపరిచి కబురుచేదామని అనుకొంటూవున్నాడు. పురుషోత్తముడు కూడా ఈ సంబంధం నిశ్చయమైనట్టే భావించి, తన రాజ్యానికి వెళ్ళిపోయాడు.

అయితే, తీరా పురుషోత్తముడు మరలిపోయిన తరువాత కంచిరాజుకు ఒక

ఆర్. జయంతి



చిత్రమైన సంశయం పటుకొన్నది .అది యేమిటీ అంటే—

గంగవంశపు రాజులు గొప్పభక్తులు. తరతరాలుగా వారు జగన్నాథస్వామిని కొలుస్తూ ఉండేవారు. పుణ్యక్షేత్రమైన శ్రీజగన్నాథంలో స్వామికి బ్రహ్మాండమైన ఆలయం నిర్మించిందికూడా వారే—అనగా గంగవంశప్రభువులే. స్వయంగా స్వామి వారికి కైంకర్యాదులు జరిపించటం ఆ రాజులకు వంశాచారమై వుంటున్నది.

ఇలా వంశపరంపరగా వస్తున్న ఆచారాన్ని అనుసరించి, ఏడాదికి ఒకసారి లాంఛనప్రాయంగా, పురుషోత్తముడుకూడా



జగన్నాథస్వామివారి ఆలయానికి వెళ్ళటం, ఉత్సవసమయమందు స్వామికి సేవచేసినట్టు సూచనగా బంగారు కట్టు గల చీపురుతో అట్టె నేల ఊడవటం మామూలు.

ఈ సంగతి తెలిసిన కంచిరాజు మనసు మార్చుకొని, 'ఊడ్చేవాడికా నా కూతురునిచ్చి పెళ్ళిచేయటం? ఇవ్వనుగాక, ఇవ్వను' అని ఖచ్చితంగా చెప్పి, పురుషోత్తముడి తండ్రికి కబురు పంపించాడు.

కంచిరాజు పంపిన కబురు చెవినిపడగానే, పురుషోత్తముడికి చెప్పలేని పౌరుషం వచ్చేసింది. అందులోనూ, ఈ విధంగా తమ ఇలవేలుపయిన స్వామివారినే దూషించటంతో అతను ఉగ్రుడై, కంచి రాజుకి శాస్తిచేయాలని ప్రతిజ్ఞ పట్టాడు.

పురుషోత్తముడు ఇలా ప్రతిజ్ఞపట్టిన మరి కొద్దిరోజులలోనే గంగుసేనలు పోయి కంచి రాజ్యాన్ని ముట్టడించినై. అయితే, కంచి రాజు చూడగా సామాన్యుడు కాదు. ఆ యుద్ధంలో గంగుసేనలను అవలీలగా తరిమివేశాడు కంచిరాజు.

ఓడిపోయిన పురుషోత్తముడు నిరాశ చెందలేదు. ఈసారి రెట్టింపు ఉత్సాహంతో మరింత ఎక్కువగా సైనికబలం సమకూర్చుకొని, ఇంకా ఎక్కువ పట్టుదలతో రెండవ








సారి యుద్ధానికి వెళ్ళాడు. ఎంత సమర్థుడైనప్పటికీ కంచిరాజు, ఈమారు జరిగిన మహాయుద్ధంలో నెగ్గలేకపోయ్యాడు.

ఎప్పుడైతే కంచిరాజు ఓడిపోయాడో, కసికొద్దీ పురుషోత్తముడు, తనకు శత్రువైన కంచిరాజునూ రాజకుమారినీ బంధించుమని ఆజ్ఞాపించాడు.

ఇప్పుడు తన వశమైవున్న ఆ రాజకుమారిని పెళ్ళాడటానికి ఎటువంటి అభ్యంతరమూ లేదుగనుక, పురుషోత్తముడు అలా చేస్తాడని అనుకొన్నారు అందరూ. కాని, పురుషోత్తముడు ఆ పిల్లను పెళ్ళాడదలచలేదు సరికదా, మళ్లీ కన్నెత్తిఐనా చూడలేదు. తన మంత్రిని పిలిచి, 'ఈ అమ్మాయికి ఎవడైనా ఊడ్చేవాడి సంబంధం చూచి ముడిపెట్టవలసిం' దని ఆజ్ఞ ఇచ్చాడు.

కోపంకొద్దీ రాజు ఇచ్చిన ఆజ్ఞను పాలించటమా, వద్దా? అని గట్టిసమస్య పట్టుకొన్నది మంత్రికి. అయితే—మంత్రి మంచి బుద్ధికుశలుడు. ఈ విషయంలో ఎంతమాత్రం తొందరపడకూడదు, బాగా నిదానించాలి అనుకొన్నాడు. 'సరే'నని రాజు వద్ద సెలవుతీసుకొని, ఆ క్షణమందే ఎవ్వరికీ తెలియని ఒక రహస్యస్థలంలో కంచి రాజకుమారికి బస ఏర్పరిచి, అక్కడ ఆమెకు సమస్తమైన రాజోపచారాలూ జరగటానికి తగిన ఏర్పాట్లుచేశాడు. ఈ సంగతి బ్రహ్మరుద్రులకైనా తెలియదన్నమాట.

ఆజ్ఞ ఇచ్చినతరువాత పురుషోత్తముడు రాజకుమారినిగురించిన సమాచారమే మరచిపోయాడు. కంచిరాజుకు కూడా క్రమేణ కోపంతగ్గింది. దురుసుతనంగా తను ఆనాడు తూలనాడినందుకు ఎంతగానో పశ్చాత్తాపం చెందాడు.

తరువాత, మరి కొద్దినెలలకల్లా మళ్ళీ శ్రీజగన్నాథ స్వామివారి ఉత్సవాలు వచ్చినై. మామూలుప్రకారం పురుషోత్తముడు స్వామిని సేవించే దీక్షలో మగ్నుడయ్యాడు.

బంగారుపిడి గల ఒక చీపురు ప్రభువుచేతికి అందించాడు పూజారి. పురుషోత్తముడు అత్యంత భక్తితో స్వామివారి పాదాలవద్ద ఊడుస్తున్నాడు.

ఆ సమయాన మంత్రి వచ్చి వినయంగా ప్రభువు ఎదుట చేతులుకట్టుకు నిలబడ్డాడు. ఆతనివెంబడే సర్వాలంకారశోభిత అయిన ఒక లోకైకసుందరి పూలమాల చేతపట్టుకొని నిలబడింది.

'మహారాజా!—మన్నించాలి. ప్రభువుల ఆజ్ఞ పాటించవలసిన సమయం నా కిప్పుడు దొరికింది. 'శ్రీ స్వామివారి పాదధూళిని ఊడ్చి సేవించేవానినే నే భర్తగా ఎంచుకొన్నాను' అని ప్రతిజ్ఞ పట్టి వున్నది ఈ రాకుమారి. ఎక్కడ వెదకినా అటువంటి యోగ్యుడు నాకు కనిపించలేదు. కనుక, ఈ కన్యను మళ్లీ ఏలికకే అర్పించుకొంటున్నాను" అని చెప్పి వెనక్కు తప్పుకొన్నాడు బుద్ధికుశలుడైన మంత్రి.

అప్పుడు కంచి రాజకుమారి భక్తితో పూలమాలను పురుషోత్తముడి మెడలో వేసింది. అకస్మాత్తుగా గుడిపైనుండి పువ్వుల వాన కురిసింది. పురుషోత్తముడికి అమితాశ్చర్యం కలిగింది. తలవని తలంపుగా వెనుకటి విషయాలు గప్పున గుర్తుకు వచ్చినై.

ఇదంతా స్వామివారి మహిమే కదా అనుకొని, పురుషోత్తముడు ఈ పెళ్లికి తన సమ్మతిని తెలిపాడు.

అప్పుడే కంచిరాజుకూడా విముక్తుడై వచ్చాడు. పురుషోత్తముడికీ కంచిరాజుకుమార్తెకూ అత్యంత వైభవంగా వివాహం జరిగింది!

ఈవిధంగా జరిగినందుకు రాజ్యంలో ప్రజలంతా అమితంగా సంతోషించారు. మంత్రియొక్క బుద్ధికుశలతను ఆబాలగోపాలమూ వేనోళ్ల వినుతించారు. 'ధన్యుణ్ణి అయ్యాను' అనుకొన్నాడు కంచిరాజు.



# చెట్టుమీద పిట్టలు - టైపు చిత్రం



పంపినవారు:

కె. ఎస్. ముత్తురాజు, B. Sc.

బెంగుళూరు







# దంపతుల కలహం

చీకటి పడగానె లేచి
పిల్లల తా మేలుకొలిపి
వేగముగ ముగించి పనులు
మగని కంత సిద్ధపరిచె.

అప్పుడె లేస్తాడొ, మగడు
ఇప్పుడె లేస్తాడొ అనుచు
చూచి చూచి, ఎలుకమ్మ
మంచము దరి నిలచింది.

'ఏమండీ, మిమ్మలినే!
లేవండీ, గుర్రు మాని.
సంసారం ఎట్లు సాగు
సిగ్గులేక పండుకొంటె?

'మానవులంతా పడుకొన్నారు
మంచినిద్రలో మునిగున్నారు
పిల్లియములు పాయికడ నున్నవి
పందికొక్కు లూరంతా చుట్టినై.

'పందికొక్కు లంతా కబళిస్తే
మన కేమున్నది, అంతా నాస్తే!
లే, లే, లేవయ్యా వేగం
పో, పో. లే, తాత్సారం!'

గండుఎలుక, తా మండిపడుతు 'మరి
ఉండు, పట్టెదను నీ తాళం!

(వినోద రచన)

అబ్బా! ఇదె ఈ ఆడువాళ్లతో,'
అనుచు లేచె, బల్ కోపముతో.

'బయట తిరిగి నే నెంత అలసితినొ
భయము లేని నీ కేమి తెలుసునే?'
అని ఎలుకయ్య తిరిగి పండుకొనె,
కని ఎలుకమ్మ వేసరిపోయెను.

కొంతసేపటికి అయ్య మేలుకొని
'ఇంత పడవేయి తినుట కేమయిన'
అన విని పెళ్లాం కళ్ళెర్రజేసి
'తినుటకు లేదిట నిద్రపోతులకు.'

నిద్దుర బద్దక మొక వంక
ఆకలి కోపము ఒక వంక;
మూలనున్న ఒక కర్ర తీసుకొని
పెళ్లాం పిల్లల బాదాడు.

డాండూం! డాండూం! గభీ గుభీ!!
ఇల్లూ ఇల్లా లొకటే గోల!
ఎటు చూచిన పెను కల్లోలం
అటుపిమ్మట అంతా శాంతం.

బుద్ధివచ్చి బయలుదేరె అపుడు ఎలుకయ
సుద్దు లెన్నొ చెప్పిపంపె తోడ ఎలుకమ్మ.
వీధికొచ్చి ఎదురుచూడ గండుఎలుకకు
మార్మోగె మ్యావుమనెడి శబ్దము చెవిలో!










# గొలుసుకట్టు నాట్యం

సూర్యభగవానునికి ఇద్దరు కుమారులు. మొదటివాడు యముడు, రెండవవాడు శని.

సూర్యుడు రోజూ ప్రొద్దుటే తన ఏడు గుర్రాల రథంమీద లోకసంచారానికి వెళ్ళటం మామూలు. ఒకనాడు యముడు 'నేనుకూడా మీతో వస్తాను. ఇంటివద్ద కూర్చుంటే ఏమీ తోచటంలేదు' అన్నాడు తండ్రితో. 'సరే' అన్నాడు సూర్యుడు.

కాని యముడు దుస్తులు వేసుకు వచ్చేసరికి ఒక్క క్షణం ఆలస్యమైంది. సూర్యుడు ఎవరికోసమూ ఆగటానికి వీలులేదు కదా! యముడు గుమ్మంలోకి వచ్చేసరికి సూర్య రథం వెళ్ళిపోయింది. అప్పటికి యముడు ఇంకా చిన్నవయసువాడు కావటంచేత, తండ్రి వెళ్ళిపోయినందుకు ముఖం చిన్నబుచ్చుకొన్నాడు.

అతనికంటె చిన్నవాడు శని; కాని శుద్ధ కొంటె. అన్నను చూసి 'ఏమోయ్, అలాగ పెట్టావు మొహం?' అని అడిగాడు. సంగతి అంతా చెప్పాడు యముడు.

అప్పుడు శని, 'ఆయనతో వెడితే నీకు ఏంలాభం? ఎక్కడైనా కాస్త తమాషా కనపడిందనుకో; చూదామంటే ఆయన క్షణంకూడా రథాన్ని ఆపడే! నీకు ఊసుపోవాలంటే నాతో రా. కడుపు చెక్కలయేటట్లు నవ్వించే తమాషా చూపిస్తాను' అన్నాడు. శని వెనకాలే వెళ్ళాడు యముడు.

వాళ్ళు వెళ్ళి భూలోకంలో ఒక పట్టణం ప్రవేశించారు. అప్పుడే తెల్లవారిందిగనక వీథిలో ఎక్కడా జనసంచారం లేదు. శని, బంగారానికిమల్లే మిలమిల మెరిసిపోతూవున్న తన జలతారు చెప్పులజోడు ఒకటి వీథికి మధ్యగా పెట్టి చక్కావచ్చి, యమునితోబాటు ఒక చెట్టుచాటున నిలబడి, 'ఏంజరుగుతుందో చూడు!' అన్నాడు కొంటెగా నవ్వుతూ.

కె. ప్రకాశరావు

ఆ నగరంలో లక్ష్మయ్యశెట్టి అనే లక్షాధికారి ఉన్నాడు. ఆయన ప్రొద్దుటే లేచి తన దుకాణానికి పోతూ, నడివీథిలో కనపడ్డ ఆ జలతారుజోడును చూశాడు.

'ఎవరిదో రాత్రి బండిలోంచి జారిపోయి వుంటుంది' అనుకున్నాడు. తన కాలికి వున్న పాత చెప్పులజోడు వదిలి ఆ జలతారు జోడు సరిపోతుందేమో అని కుతూహలపడి తొడిగిచూశాడు.

చిత్రమేమిటంటే: ఆ జోడు, తనకోసమే తయారయిందా అన్నట్టుగా అతని కాళ్ళకు సరీగా అమరిపోయింది. ఎవరైనా కనిపెట్టు తున్నారేమో అని అతడు అటూ ఇటూ చూసి, ఎవరూ చూడలేదులే అనుకొని ఠీవిగా ఒక్క అడుగు ముందుకు వేశాడు.

కాని నేలమీద అడుగు పెట్టీపెట్టడంతోనే ఏదో తన్నినట్టయి అతడు నేలమీదినుంచి పైకెగిరాడు. జోళ్ళు నేలకు తగులుతున్న కొద్దీ అతడు గెంతడం మరీ ఎక్కువ కాసాగింది. చూసేవాళ్లకి అతడేదో నాట్యం చేస్తున్నట్టుగా కనపడింది.

మొదట శనీ, యముడూ తప్ప, చూసే వారెవరూ అక్కడ లేరు. కాని, క్రమంగా వీథిలో జనం బాగా పోగయారు. లక్ష్మయ్య స్థూలకాయంతో ఎగురుతూవుంటే వాళ్ళందరికీ చూడ తమాషాగానే ఉంది. కాని




అటువచ్చిన సెట్టిగారి ఒడ్డిమంగలి ఆయన అవస్థ చూసి జాలిపడ్డాడు. తాగి తందనాలాడుతున్నాడుకాబోలని తోచింది. మెల్లిగా ఇంటికి చేర్చటం మంచిదని దగ్గిరకు వెళ్ళి, సెట్టిగారి కుడిచెయ్యి పట్టుకున్నాడు.

పట్టుకొనీ పట్టుకోవడంతో, సెట్టిగారి చెయ్యి వాని చేతికి అంటుకుపోయి, సెట్టితో బాటు వాడుకూడా నాట్యం మొదలెట్టాడు. బియ్యం తెస్తానని వెళ్ళిన ఒడ్డిమంగలి ఎంతకూ రాలేదని వాడి తల్లి వెతుక్కొంటూ వచ్చింది. సెట్టితోబాటు నాట్యంచేస్తూవున్న కొడుకుని చూసి, 'ఇదేం పోయేకాలంరా?'

అంటూ వాడి చెయ్యి పట్టుకుని ఇంటికి ఈడ్చుకుపోబోయింది.

పోబోయిందికాని, కొడుకు చేతిని పట్టు కోవడంతోనే ఆమె చెయ్యి అంటుళ్లా అయి, ఆ అవ్వకూడా నాట్యం మొదలెట్టింది.

వీధిలో ఇలా జనం మూగటంతో రక్షక భటు డొకడు వచ్చి, 'ఏమిటి ఈ అల్లరి? నడవండి, న్యాయాధిపతిదగ్గరికి!' అని గదిస్తూ, సెట్టిగారి ఎడంచెయ్యి పట్టుకుని లాక్కుపోబోయాడు. కాని వెంటనే వాని చెయ్యి ఆయన చేతికి అంటుకుపోయి వాడుకూడా మేళంలో చేరి గంతులెయ్యటం ప్రారంభించాడు.

మరొక నిమిషానికి రక్షకభటుల అధికారి వచ్చి, 'అల్లరి ఆపటానికి బదులు ఈ నాట్యంలో చేరి నువ్వు గంతులేస్తున్నావా?' అని రక్షకభటునిపై మండిపడుతూ, కోపంతో వాని చెయ్యి పట్టుకునేసరికి అతడు కూడా వాళ్లందరితోపాటు నృత్యం మొదలెట్ట వలసి వచ్చింది. చెట్టు చాటునుండి చూస్తున్న యముడికి ఇదంతా మొదట తమాషాగానే ఉంది. కాని పెద్దబొజ్జతో నాట్యంచెయ్యలేక అవస్థ పడుతున్న సెట్టినీ, ముసలితనంలో గంతులెయ్యలేక గోల చేస్తున్న ఆ అవ్వనూ చూసేసరికి అతనికి జాలివేసింది.

అతడు అప్పుడు తమ్ముడయిన శనివైపు చూసి, 'ఇంక వీళ్ళని బాధపెట్టకు!' అన్నాడు. శని గారడీవానికిమల్లే తన చేతిని ఒక్కసారి విసిరేసరికి, చేతులు అంటుకు పోయి నాట్యంచేస్తూన్నవాళ్ళ అందరి హస్తాలూ విడిపోయి, వాళ్లు తలొకవైపూ పడిపోయారు. 'ఏమిటి ఇదంతా?' అని ఎవరో సెట్టిని అడిగారు. 'ఇదా బాబూ!— ఇదుగో ఈ జోడుమూలాన వచ్చింది' అంటూ జోడు ఊడదీసి బైట పడవేశాడు. చూస్తూ వుండగానే ఆ జోడుకు రెక్కలు వచ్చి పక్షులలాగ ఎగిరి మాయమైంది.



# రాజభక్తుడు




విదర్భదేశాన్ని జయపాలుడనే రాజు పాలించుతూ ఉండేవాడు. ప్రజలను కన్న బిడ్డలలాగా చూచుకోవటంవల్ల ఆయన పరిపాలనలో అంతా సుఖంగా కాలం గడుపుతూ ఉండేవాళ్ళు.

ఒకనాడు జయపాలుడు కొంతమంది పరివారంతో కలిసి అడవికి వేటకోసమని బయలుదేరాడు. అడవిలో ఒక పెద్దపులిని వెంటాడుతూ జయపాలుడు చాలా దూరం వెళ్లాడు. తక్కిన పరివారం జయపాలుణ్ణి అనుసరించలేక పొయ్యారు.

చివరకు విసిగి, జయపాలుడు బాణాన్ని ఎక్కుపెట్టి, పులిమీదికి వదిలాడు. అది గురి తప్పిపోయింది. ఐనా, పోయి పులికి తొడలో తగిలింది. ఎలాగైనా పులి తప్పించుకుందామంటే ప్రయత్నం సాగిందికాదు.

బతికి బయటపడాలంటే, జయపాలుడు రెండో బాణాన్ని తనమీదకు వదలకముందే ఉరికి చంపాలి. దెబ్బతిన్న ఆ పులికి కలిగిన బాధా, వేటగానిమీద కలిగిన కోపమూ దాని నిశ్చయాన్ని మరింత బలపరిచినయి.

వెంటనే పులి ఎదురుతిరిగింది. శరవేగంతో జయపాలునిమీదికి ఉరికింది. ఆ దెబ్బకు జయపాలుని గుర్రం పట్టుతప్పి నేలమీద పడింది. జయపాలుడు దగ్గరనే వున్న ఒక పొదలో పడ్డాడు. లేచి, మరొక బాణాన్ని సంధించేందుకా వ్యవధి లేదు. పులివల్ల తనకు చావు తప్పదనుకున్నాడు...

ఇదే సమయంలో, అనుకోకుండా ఒక బ్రాహ్మణుడు పక్కనే వున్న చెట్టుమీది నుంచి కిందికి దూకాడు. రెప్పపాటులో

డి. శివరాం



గొడ్డలితోసహ పులిమీదకు ఉరికి, దాని తలను నరికివేశాడు. జయపాలునికి ఇదంతా ఒక కల అనిపించింది.

జయపాలుడు తేరుకొన్న తర్వాత, బ్రాహ్మణునికి తన కృతజ్ఞతను తెలిపాడు. పైగా అతని ధైర్యసాహసాలను మెచ్చుకున్నాడు. తనను కాపాడిన అతని కథను కూడా తెలుసుకున్నాడు.

ఆ బ్రాహ్మణుడు చాలా బీదవాడు. పెళ్లాన్నీ, ఇద్దరు పిల్లల్నీ పోషించేటందుకు రోజూ అడవికి పోయి కట్టెలు కొట్టితెచ్చి, వాటిని అమ్ముకొని జీవిస్తూ ఉండేవాడు. అతని పేరు రామశర్మ.

జయపాలునికి రామశర్మమీద మంచి అభిమానం ఏర్పడింది. వెంటనే అతనిని సకుటుంబంగా తన రాజధానికి రమ్మని ఆహ్వానించాడు. అతన్ని తన రక్షకదళాలలో ముఖ్యునిగా నియమించాడు.

రామశర్మకు మరి దారిద్ర్యం పోయింది. చాలా సుఖంగా కాలం గడుస్తున్నది. అతని కొడుకూ, కూతురూ పెద్దవాళ్లవుతున్నారు.

ఇలా వుండగా ఒకనాటి రాత్రి జయపాలుడు రామశర్మకు కబురుచేసి పిలిపించాడు. మేడమీదకు తీసుకొని వెళ్ళి ఇలా అన్నాడు:

"శర్మా! జాగర్తగా విను...నీకేమైనా శబ్దం వినిపిస్తోందా?"

ఆ చీకటిరాత్రి అంతా నిశ్శబ్దంగా వుంది. బైట ఏమీ కనిపించటం లేదు. చాలా జాగర్తగా వింటేనేకాని, తెలియటంలేదు.

కొద్దిసేపు విన్నాక రామశర్మ జవాబు చెప్పగలిగాడు: "ఔను ప్రభూ! ఉత్తర దిశలో ఎవరో సన్నగా ఏడుస్తున్నారు. కంఠ స్వరాన్నిబట్టి ఒక స్త్రీ ఐవుంటుందనుకుంటున్నాను—" అన్నాడు.

"ఔను...బహుశా చాలా దూరంనుంచే ఆ శబ్దం వస్తూంది. అందుకనే స్పష్టంగా వినిపించటంలేదు" అన్నాడు జయపాలుడు.

దీనికి రామశర్మ తల తిప్పాడు.

"నా రాజ్యంలో ఎవరికి ఏ బాధ కలిగినా వెంటనే కనుక్కోవలిసిన బాధ్యత నాకు వుంది. కనుక అదేమిటో నీవు వెళ్లి తెలుసుకు రావాలి" అన్నాడు రాజు.

వెంటనే బయలుదేరాడు రామశర్మ. కారుచీకటి ; కన్ను పొడుచుకున్నా దారి కనిపించటంలేదు. చలిగాలి రివ్వున వీస్తున్నది. చేతిలో విచ్చుకత్తితో ఆ ఏడ్పు వినవస్తూన్న వైపు నడక సాగించాడు రామశర్మ. నిర్మానుష్యమైన ప్రదేశంలోనుంచి ధైర్యంగా నడిచిపోతున్నాడు; మధ్యమధ్యన ఆగి ధ్వనినిబట్టి తాను సరిగా నడుస్తూ వున్నదీ, లేనిదీ నిర్ణయించుకొంటున్నాడు.

ఇక్కడ జయపాలుడు—రామశర్మ వెళ్లినప్పటినుంచీ ఆలోచనలో పడ్డాడు. రామశర్మ నిజంగా ఒక్కడూ వెళ్ళి కనుక్కొని రాగలడా? లేక ఇంటికి వెళ్లి పడుకొని, ఏ తెల్లవారుజామునో తిరిగి వచ్చి, ఏదో ఒకటి చెపుతాడా? రామశర్మ ధైర్యసాహసాలమీద రాజుకు నమ్మకం లేకకాదు. ఒకవేళ శర్మ బద్ధకిస్తాడేమోనని ఇలా సంశయించటం.




ఎందుకైనా మంచిదని జయపాలుడు కూడా రామశర్మను చాటుగా అనుసరించ సాగాడు. రామశర్మకు ఏదైనా ప్రమాదం సంభవించినా, తను సహాయపడేటందుకు అవకాశం వుంటుంది. ఒకప్పుడు తన ప్రాణాన్ని కాపాడిన శర్మకు తను ఈవిధంగా కృతజ్ఞతను చెప్పగలుగుతాడు.

రామశర్మ ఉత్తరదిశగా నడక సాగిస్తున్నాడు. పోనుపోను స్త్రీయొక్క రోదనధ్వని మరింత స్పష్టంగా వినిపించసాగింది. తాను సరియైన మార్గంలోనే నడుస్తున్నాననే నమ్మకం కుదిరినకొద్దీ, రామశర్మ మరింత వేగంగా నడుస్తున్నాడు.






పోయిపోయి, రామశర్మ ఊరిబైట ఉన్న శ్మశానంలో ప్రవేశించాడు. రాజభక్తుడైన రామశర్మకు భయం వేయలేదు. సహజ సిద్ధమైన అతని ధైర్యానికి తోడు, తను ఒక మంచిపని చేస్తున్నానుకదా అనే తృప్తికూడా అతని పట్టుదలకు ఎక్కువగా తోడుపడింది.

శ్మశానం మధ్యని ఒక స్త్రీ ఏడుస్తూ ఉండటాన్ని చూశాడు రామశర్మ.

"అమ్మా! ఎందుకు ఏడుస్తున్నావు? మీరు ఎవరు? తెలుసుకురమ్మని నన్ను రాజుగారు పంపించారు—" అన్నాడు శర్మ, ఎంతో వినయంతో.

"నేను ఎవరైతే నీకేమి? ఆర్చగలవా, తీర్చగలవా?" అన్న దామె.

"ఏమో—రాజుగారు తన ప్రజలను కన్న బిడ్డలలాగా పాలిస్తున్నారు. మీ కష్టాన్ని తీర్చటం అదొక ఘనకార్యం కాదని నా నమ్మకం" అన్నాడు రామశర్మ.

"సరే ఐతే వినండి: నేను భూదేవిని. మరొక వారంరోజులలో రాజు చనిపోతాడు. ఇన్నాళ్ళుగా నన్ను పాలించిన ప్రభువు నన్ను విడిచి పోతున్నాడే అని నేను విచార పడుతున్నాను" అన్న దామె.

నిశ్చేష్టుడయ్యాడు రామశర్మ. కొంచెం తేరుకొని "రాజుగారిని కాపాడే మార్గం ఏమైనా వుందా?" అని అడిగాడు.

"లేకేమి? ఉన్నది. కాని ఎవరూ సాహసించలేరు" అన్నది.

"చెప్పండి. నేను సాధిస్తాను" అన్నాడు రామశర్మ ధీమాగా.

"శ్మశానానికి అవతలిపక్కన భద్రకాళి ఆలయం వుంది. ఒక బ్రహ్మచారిని కాళికా దేవికి బలి యిస్తే ఈ గండం గడిచి, రాజు పూర్ణాయుర్దాయాన్ని అనుభవించ గలుగుతాడు" అంది భూదేవి.

రామశర్మ తిరుగుముఖం పట్టాడు. మెల్లిగా నడుస్తూ ఆలోచించసాగాడు.








ఊళ్లో ఎంతోమంది బ్రహ్మచారులు ఉన్నారు. కాని తమ బిడ్డను బలిపెట్టేందుకు ఏ తల్లిదండ్రులు ఒప్పుకుంటారు? ఇదీ అతనికి పట్టుకొన్న సమస్య. మరొక్క క్షణం అట్టె యోచించేసరికి రామశర్మకు మెరుపు మెరిసినట్లయింది. తన కొడుకు బ్రహ్మచారే! ఒకళ్లను యాచించకుండా, తన కొడుకునే బలి పెట్టటంతో జయపాలుని ప్రాణాలు తను కాపాడవచ్చుగా.

కాని తనకూ కడుపుతీపి లేకపోలేదు. చూస్తూచూస్తూ కన్నకొడుకును బలిపెట్టడమంటే హృదయం అల్లాడక తప్పదు... కాని గత్యంతరంలేదు. కొడుకు పోతే తనొక్కడే విచారించేది. రాజు పోతే?— రాజ్యమంతా తలక్రిందులై అల్లకల్లోలమై పోతుందే! కనుక ప్రజాక్షేమంకోసం కొడుకును బలిపెట్టటానికే రామశర్మ నిశ్చయం చేసుకొన్నాడు.

ఈ నిశ్చయంతో అతను చకచకా నడవసాగాడు. ఇంటికి రాగానే కొడుకును లేపి, స్నానం చేయించి శుచిగా తనతో రమ్మని అన్నాడు. తండ్రి మాటకు ఎదురాడని కొడుకు, తండ్రి చెప్పినట్లే చేశాడు. తాను చేయబొయ్యే పనిని భార్యకుకూడా తెలియనీయలేదు రామశర్మ.

కొడుకును తీసుకొని భద్రకాళి ఆలయానికి వెళ్ళాడు. గుడిలో హారతి వెలిగించిన తరువాత కొడుకుతో అంతా చెప్పాడు.

వెంటనే పిన్నవాడు ఎంతో ఉత్సాహంతో "తండ్రీ! ఇంత గొప్ప అవకాశం దొరకటం మన అదృష్టంకదా! ఇంకా ఆలోచిస్తారెందుకు? ఇప్పుడే నన్ను భద్రకాళికి బలి వెయ్యండి" అన్నాడు.

కుర్రవాడు భద్రకాళి విగ్రహంముందు తల వంచాడు. చెక్కుచెదరని ధైర్యంతో రామశర్మ పదునైన కత్తిని కొడుకు మెడ మీదకు ఎత్తాడు. మరు క్షణంలో కొడుకు తల తెగిపడుతుంది. ఆ సమయంలో

అతని చేయి కదలకుండా ఎవరో పట్టుకున్నట్టయింది.

వెనక్కు తిరిగి చూస్తే—ఆమె భద్రకాళి! దేదీప్యమానంగా ప్రకాశిస్తూ, కళ్లు మిరిమిట్లు కొలిపేటట్టుగా వున్న ఆమెముందు సాష్టాంగపడ్డాడు రామశర్మ.

"శర్మా! నీ భక్తికి నేను మెచ్చాను. నీ కొడుకును బలిపెట్టకుండానే, నీ కోర్కె ఫలిస్తుంది" అని చెప్పి కాళి మాయమైంది.

రామశర్మ కొడుకును ఇంటిదగ్గర దిగబెట్టి తను తృప్తితో రాజభవనానికి వెళదామని బయలుదేరాడు.

ఈ చిత్రమంతా జయపాలుడు చూసేవున్నాడు. రామశర్మ వచ్చేలోపలే జయపాలుడు అతనికోసం ఎదురుచూస్తున్నట్టుగా కోటలో కూర్చొని వున్నాడు.

రామశర్మ వచ్చి "ప్రభూ! అదేమీ లేదు. ఎవరో పేదరాలు కొడుకు చనిపోయి ఏడుస్తూవుంది. పోయి, ఊరడించి వచ్చాను. అంతే" అన్నాడు.

జయపాలునికి నిజం తెలియకపోలేదు. ఐనప్పటికీ రామశర్మ చెప్పిన విషయాన్ని నమ్మినట్లే నటించి ఊరుకున్నాడు.

మరునాడు దర్బారులో గతరాత్రి జరిగినదంతా చెప్పి జయపాలుడు ఇలా అన్నాడు: "రామశర్మ నాకు మరిఒకసారి ప్రాణదానం చేశాడు. కాని తన గొప్పను చెప్పుకోవటం అతని లక్షణం కాదు. తన ప్రభువుకోసం ఎంతటి త్యాగానికైనా వెనుదీయని ఈ రామశర్మ ఋణం ఏవిధంగా తీర్చుకోగలనో నాకు తోచటంలేదు" అని అంటూ శర్మకు ఘనమైన సన్మానం చేశాడు; అతనికి వెంటనే గొప్ప పదవి ఇచ్చాడు.

రామశర్మకు జరిగిన గౌరవాన్ని అందరూ హర్షించారు. రామశర్మ చూపిన రాజభక్తి వాడవాడలా మారుమ్రోగింది.



# అట్టివిహారి బొమ్మ

ఒకప్పుడు గ్రీష్మకాలంలో కృష్ణార్జును లిద్దరూ వనవిహారం బయలుదేరారు. పోయిపోయి, ఖాండవ వనం సమీపానికి చేరుకొన్నారు. అక్కడ వారు సుఖాసీనులైవుండగా, ఒక వృద్ధబ్రాహ్మణుడు వచ్చి "మీరెవరో మహానుభావులలాగా ఉన్నారు. నేను చాలా ఆకలిబాధతో వచ్చాను. 'తీరుస్తాను' అని మీరు మాట ఇస్తే, నా కథ చెబుతాను" అన్నాడు.

వెంటనే అర్జునుడు "చెప్పవయ్యా బ్రాహ్మడా! నే నుండగా నీకేం భయం?" అన్నాడు, ధీమాగా. ఈమాట చెవినిపడగానే వృద్ధుని రూపంలో వున్న అగ్నిదేవుడు ఇలా చెప్పాడు :

"నేనే అగ్నిని. లోగడ శ్వేతకి అనే రాజు లెక్కలేనన్ని యాగాలు చేశాడు. ఆయన చేసిన యాగాలు ఎన్ని అని లెక్కచెప్పాలంటే వినండి : వాటిలో పాలొన్న బ్రాహ్మణులకు పొగవల్ల నేత్రరోగాలు వచ్చినై. హోమం చేసిన నెయ్యి తాగితాగి నాకు కడుపునొప్పి పట్టుకొన్నది. ఈ బాధ వదుల్చుకోవటం ఎలాగా? అని బ్రహ్మదేవుణ్ణి ప్రశ్నిస్తే, 'ఖాండవవనాన్ని దహించవయ్యా, నీ రోగం ఇట్టె నయమవుతుంది' అని అన్నాడు. నేను ఎన్నోసారులు ప్రయత్నం చేశానుకాని, ఆ వనానికి అధిపతి ఐన దేవేంద్రుడు వర్షం కురిపించటంవల్ల ఆటంకం కలిగి, నా కోరిక నెరవేర్చుకోలేకపోయాను.

"ఈ సంగతి మళ్ళీపోయి బ్రహ్మతో చెప్పుకొనేసరికి, ఆయన 'త్వరలోనే కృష్ణార్జునులు ఆ వనానికి రాబోతున్నారు. అప్పుడు వారికి నీ సంగతి వినిపించి, సహాయం కోరుకో. వారు తప్పక నెరవేరుస్తారు' అని సలహా చెప్పాడు. అలానే మీరు దయచేశారు. నా కోరిక తీర్చాలి" అని ప్రార్థించాడు.

మాట తప్పటానికి మనస్కరించక అర్జునుడు, 'బాగానే వుంది. మరిప్పుడు మావద్ద ఆయుధాలు లేవే ?' అన్నాడు. అప్పుడు అగ్ని వరుణదేవుని వేడుకోగా, వరుణుడు వచ్చి అర్జునుడికి అక్షయతూణీరమూ, దివ్యరథమున్నూ, కృష్ణునికి చక్రమూ, కౌమోదకి అనే గదా సమర్పించాడు. ఈ పరికరాలతో కృష్ణార్జునులు ఒక పక్షంరోజులు కాపలా కాస్తూవుండగా, అగ్నిదేవుడు ఖాండవ వనం దహించి, తన కోరిక సఫలం చేసుకొన్నాడు.




పూర్వకాలమందు ఒకప్పుడు శుంభావతీ నగరాన్ని శంబలుడనే రాజు పరిపాలన చేసేవాడు. ఆయన ఆస్థానంలో గొప్పగొప్ప మల్లులూ వీరులూ గల పరివారం వుండేది.

ఒకప్పుడు 'మహామల్లు'డనే ఒక గొప్ప వస్తాదు శంబలుని ఆస్థానానికి వేంచేశాడు. ఆయన దేశదేశాలలో ఎంతోమంది మల్లులను గెలిచి, ఘనమైన బిరుదులూ, పతకాలూ పొందినవాడు. 'నన్ను ప్రపంచంలో ఎవ్వరూ జయించలేరు' అని చేతికి తోడా వేసుకొన్నటువంటి మొనగాడు.

మహామల్లు శంబల్మహారాజువద్దకు వెళ్లి 'మీ ఆస్థానంలో నన్ను గెలిచేవాళ్ళెవరైనా ఉన్నారా? ఉంటే సరే. లేకపోతే, ఓడిపోయినట్టు వప్పుకొని నాకు బిరుదుపత్రం ఇప్పించండి' అని సవాలుచేశాడు.

అందరూ తెల్లబోయారు. ఏమి చెప్పనూ రాజుకు తోచిందికాదు. వెంటనే మంత్రి లేచి, "దీనికేమున్నది ప్రభూ!—మన ఆస్థానంలో ఉంటూవుండే 'చండ ప్రచండ దోర్దండ గుండూమల్లు'గారికి ఈ లోకంలో సాటి ఎవరు? వారు ఇప్పుడు ఊరికి వెళ్ళి ఉన్నారుకదా. ఎల్లుండీపాటికి రానేవస్తారు. వస్తూనే, ఈ మహామల్లుగారికి బదులు చెప్పనూ చెబుతారు" అన్నాడు.

వెంటనే మహామల్లుకు సమస్తమర్యాదలతోనూ చక్కటి బస ఏర్పరుపబడింది. మహామల్లు బసలో కూర్చున్నాడేకాని, మంత్రిమాటలు విన్నప్పటినుంచీ మనస్సు అదోకలాగ మారిపోయింది. పరిచారకులను చేరబిలిచి, ఆ 'గుండూమల్లు'నుగురించి భోగట్టాలు అడిగాడు ఆత్రంతో.

అందుకు పరిచారకులు 'ఆయనేనండి ఇక్కడి మల్లులకందరికీ గురువు. వారు యోగసాధనలో ఉంటారు. తగినంత పని కలిగి, ఇక ఆస్థానం పేరు పోతుందేమో

బి. లక్ష్మినారాయణ

అనే సమయం వస్తేతప్ప సామాన్యంగా బయటికే రారు' అని చెప్పారు.

మరునాడు, మహామల్లు బసకు సమీపం లోనే ఒక ప్రత్యేక భవనం నిర్మించారు. దానికి ఒక బ్రహ్మాండమైన సింహద్వారం అమర్చారు. ఇది చూచి ఆశ్చర్యపడి, 'ఏమిటి?' అని అడిగాడు మహామల్లు. అందుకు సేవకులు "ఏమున్నదండి. మా గుండూమల్లుగారు దయచేస్తారు. వారు సామాన్యులా? మామూలు గుమ్మం సరి పోదు వారికి! అందుకనే ఆసింహద్వారమూ, ఆ భవనమున్నూ' అని బదులుచెప్పారు.

ఇల్లుకట్టే పనివాళ్లతో మేస్త్రీ 'అరేయ్, బాగా గట్టిగా దిమ్మిశ కొట్టండి. మన గుండూ మల్లుగారు అడుగులు వేశారంటే నేల దిగ బడిపోయి గోతులు పడుతుందిసుమా. జాగర్త!' అంటూ హెచ్చరింపసాగాడు. మహా మల్లు చూస్తూవుండగానే గంగాళాలతోనూ, బండ్లతోనూ వెన్న, బాదంపప్పులూ, వస్తాదులు తినే పదార్థాలూ వచ్చిపడుతున్నాయి.

ఈ అట్టహాసమంతా పరిశీలనగా కని పెట్టుతూనే వున్నాడు మహామల్లు. ఆ మరు నాడు గుండూమల్లుగారు ఈకొత్తభవనంలో దిగుతారని నగరమంతటా మారుమోగింది.

అన్నట్టుగానే, మరుసటి ఉదయానికల్లా ఇరవై ఎనిమిది గుర్రాలు లాగేటటువంటి ఒక చిత్రమైన సారటు వచ్చి భవనం వాకిట నిలిచింది. పరివారమంతా 'చండప్రచండ దోర్దండ గుండూమల్లుగారికీ జై!—' అంటూ పెద్దగా ఘోషపెట్టారు. మల్లుగారికి స్వాగతమివ్వటానికని మహారాజుగారు స్వయంగా ఆ సారటువద్దకు వచ్చారు.

మహామల్లుగారికి, గుండూమల్లుగారిని పరిచయం చేదామని మంత్రి అయన బసకు వెళ్ళి చూచాడు. ఏమున్నది అక్కడ?— బస ఖాళీ! బిరుదులు వహించిన ఆ మహా మల్లుగారు ఎప్పుడు ఎలా మాయమయ్యారో ఎవళ్ళకూ తెలియనే తెలియదు!!



# తాత చతురత

పి. త్యాగరాజు



భారమైన యొక కట్టెల మోపును
తీరని శ్రమతో నొక తాత
తలపై నిడుకొని యడుగులు తడబడ
నడుచుచుండె నడి కాననలో.
మార్గాయాసం మరింత హెచ్చె
కట్టెల భారం కడు దుర్భరమై
అడుగొక్కటి ముందిడగా లేకను
పడవైచెను నేలను మోపాతడు.
'ఎంతకాల మీ శ్రమజీవితము
ఎపుడు తీరునో కష్టాలు ?
చావు మేలు ఇటు బ్రతుకుటకంటే
చచ్చెద'నని మది తలపోసి,
మృత్యుదేవతను రమ్మని కోరెను
ముదుసలి జీవితమును రోసి.
తక్షణమందున మృత్యుదేవత
వచ్చి నిలచి,— ముదుసలి మ్రోల
'తాతా! పిలిచావేల, సిద్ధమా
వచ్చితి నిను కొనిపోదు'ననెన్.
మృత్యుదేవతను చూడ ముదుసలికి
ముచ్చెమ్మటలే పోసినవి;
చచ్చుట నిజమని తెలిసిన వృద్ధుడు
భయకంపితుడై పలికె నిటుల్:
'మృత్యుదేవతా వచ్చితివా—నే
సత్యముగా ధన్యుడనుసుమా
కట్టెలమోపును మోయలేక నే
నిట్టుల పడవేసితి నేలన్,
దయతో కొంచెము సాయము చేయుము
ఎత్తుకొనగలే నొక్కడను.
అందులకే నిను పిలిచితి'నని
వృద్ధుండు పల్కె కడు చతురగతిన్.
తాత చమత్కృతి తలచుచు మృత్యువు
తనలో నించుక నవ్వుకొని
కట్టెలమోపును తాత నెత్తిపై
పెట్టి మృత్యుదేవత పోయెన్.

# గెడ్డం ఎందుకు?



సిక్కుల ఆదిగురువైన నానకు ముప్పయి ఆరవయేటనే సన్యసించాడు. అప్పటికి ఆయనకు భార్యా, ఇద్దరు బిడ్డలూ వున్నారు. భార్య చూనీదేవి. పెద్దవానికి నాలుగేళ్ళ ప్రాయం. పేరు శ్రీచంద్రుడు. వాని తమ్ముడు లక్ష్మీదాసు నెలల పిల్లవాడు.

నానకు జోగి అయి శ్మశానాల వెంట తిరుగుతూవుంటే చూనీదేవి తన ఇద్దరి కుమారులతోనూ పుట్టింటికి వెళ్ళిపోయింది. అక్కడ ఆమె భర్తను విడిచి ఇరవైనాలుగు సంవత్సరాలు గడిపింది.

ఆ ఇరవైనాలుగేళ్లలోనూ గురునానకు దేశమంతటా తిరిగి తన మతాన్ని వ్యాపింపజేశాడు. ఆయనకు అరవయ్యో పడి వచ్చి వృద్ధుడయాక దేశాటనం కట్టిపెట్టి పంజాబులోని 'బియాసు' నది ఒడ్డున ఒక చక్కటి ఆశ్రమాన్ని నిర్మించాడు. ఆ ప్రదేశానికి ఆయన 'కర్తారపురం' అని పేరుపెట్టాడు. 'కర్తారపురం' అంటే విశ్వకర్త ఐన పరమేశ్వరుడు వుండే చోటు అని అర్థం.

నలుదిక్కులనుండీ అనేకమంది సాధువులూ యోగులూ శిష్యులూ కర్తారపురం వచ్చి గురుసాన్నిధ్యంలో గడుపుతూ ఉండేవారు. ఆ శిష్యులలో కొందరు మహా ధనవంతులూ జమీందార్లూ ఐవుండటంవల్ల కానుకలెన్నో తెచ్చి భక్తిపూర్వకంగా గురువుకు సమర్పిస్తూ ఉండేవారు.

మొదటినుంచీ నానకు ధనాన్ని చిల్లపెంకుతో సమంగా చూచే పరమ వేదాంతి. వచ్చిన డబ్బునంతా యెప్పటికప్పుడు సాధువులకోసం ఖర్చుచేసి, దమ్మిడికూడ నిలవగాకుండా చూసేవాడు.

కర్తారపురంలో నానకు పీఠాన్ని స్థాపించినాడనీ, నిత్యం శిష్యులు వచ్చి విలువైన కాన్కలు అర్పించిపోతున్నారనీ చూనీదేవికి తెలిసింది. వెంటనే తన కుమారులను వెంట

సాలంకి వెంకటరామచంద్రమూర్తి




పైన పెట్టాను. ఆ పని అతడే చెయ్యాలి. మీ జోక్యం పనికిరాదు' అన్నాడు.

ఈ మాటలకు, చూనీదేవికీ ఆమె ఇద్దరు కుమారులకూ కష్టం తోచింది. ఆమె నానకుతో, 'పీఠంలో పెత్తనం మీ కన్న కుమారులకు ఉండాలికాని పరాయివాడైన లెహెనాకు ఇవ్వటం న్యాయమా?' అంది.

అప్పుడు నానకు, 'ఈ శిష్యులంతా నా కుమారులే! వీరందరిలోనూ శ్రేష్ఠుడు లెహెనా. అతడే నా అనంతరం ఈ పీఠానికి అధిపతి. లెహెనాకు గల యోగ్యత ఈ శ్రీచంద్రుడుకిగాని లక్ష్మీదాసుకిగాని లేదు. ఇక్కడ కావలసినది నా మతసూత్రాలను అర్థంచేసుకొని, వాటిని నా తదనంతరం లోకంలో బోధించే శక్తి. అంతేగాని రూపాయలను జాగ్రత్తపెట్టే శక్తి కాదు. కనుక మీరీ విషయంలో నాకేమీ శ్రమ కలిగించకండి!' అని నిర్మొగమోటంగా చెప్పేశాడు.

కాని చూనీదేవీ, కుమారులూ ఎలాగైనా ఆ పీఠాధిపత్యం దక్కించుకోవాలన్న ఆశతో ఆ మఠంలోనే పది సంవత్సరాలు గడిపారు.

గురునానక్‌నకు డెబ్బయి సంవత్సరాలు నిండాయి. ఒకనాటి ఉదయం ఆయన లెహెనాను పిలిచి, 'రేపు రాత్రి నేను ఈ లోకాన్ని విడిచిపోతాను. మన ఆశ్రమానికి

బెట్టుకుని ఆమె కర్తారపురం చేరుకుంది 'మమ్మల్నికూడా ఈ ఆశ్రమంలో ఉండ నివ్వండి' అని చూనీదేవి భర్తను కోరింది. అందుకు నానకు 'అందరితోబాటు మీరూ ఉండవచ్చు' అన్నాడు.

కాని వాళ్ళు అందరితోబాటూ ఉండక, పీఠానికి సంబంధించిన వ్యవహారాలలో పెత్తనం కలిగించుకొని, రోజూ వచ్చిపడే కానుకలనూ ధనాన్నీ జాగ్రత్తపెట్టటం ప్రారంభించారు.

నానకు ఇది కనిపెట్టి చూనీదేవినీ పుత్రులనూ పిలిచి, 'వచ్చిన సొమ్ము తీసుకొని ఖర్చుచేసే పని 'లెహెనా' అనే శిష్యుని

వెనుక మఱ్ఱిచెట్టుకింద నాకు శయ్య పరిపించు' అన్నాడు.

గురునానకు మరణశయ్యపై పరుండి భగవన్నామస్మరణ చేసుకొంటూ మృత్యువు కోసం ఎదురుచూస్తూవుండగా చూనీదేవీ, కొడుకులూ వెళ్ళి, పీఠాధిపత్యాన్ని తమ కుటుంబంలో నిలిపేటట్లు చేయవలసిందని కడపటిసారి మళ్ళీ కోరారు. కాని అయన వినిపించుకోలేదు. 'నా అనంతరం పీఠాధిపతి లెహెనాయే. నా తదనంతరం అతడు 'అంగదుడు' అనే పేరుతో సిక్కులకు గురువు ఔతాడు' అని చెప్పి, నానకు స్వర్గస్థుడయ్యాడు.

గురునానకు తదనంతరం అంగదుడు గురువై, ఎల్లప్పుడూ ధ్యానం చేసుకొంటూ, నానకు మతసూత్రాలను శిష్యులకు బోధిస్తూ, చెప్పతగిన నీతి నియమాలతో కాలం వెళ్ళబుచ్చాడు.

గురునానకుకాలంలోకన్నాఅంగదగురువు కాలంలో కానుకలూ ధనమూ ఎక్కువగా వచ్చిపడేవి. కాని అంగదగురువు ఆ ధనానికంతకూ అధిపతి అయివుండీకూడా, కొయ్యరొట్టె మాత్రమే తిని ఉండేవాడు. సొమ్మంతా సాధుసంతర్పణలకోసమే కర్చుపెట్టేవాడు. అంగదగురువంటే శిష్యకోటికి




గౌరవం ఎక్కువైనకొద్దీ నానకు కుమారులకు అసూయ ఎక్కువైంది. అంగదుని పాదాల ముందు మహారాజులూ జమీందార్లూ సాష్టాంగపడుతూవుంటే ఆ గౌరవం తమకు దక్కవలసిందికదా అనిపించేది వాళ్ళకు.

'మనమూ శిష్యుల్ని చేరదీసి గురుత్వం సంపాదిద్దాం. అప్పుడు మనకి వచ్చిపడుతాయి కానుకలూ నమస్కారాలూను!' అని శ్రీచంద్రుడు ఆలోచించి, శిష్యులను చేరదీయటం మొదలెట్టాడు. చాలా కాలం కర్తారపురంలో వుండి నానకు మతసూత్రాలను వింటూవచ్చాడు గనుక చిలుకపలుకులకుమల్లే వాటిని ఏకరుపెడుతూ వచ్చాడు.

వాటి అర్థాన్ని విప్పిచెప్పమని ఎవరైనా కోరితే, తనకు తోచిన విధంగా అవకతవక అర్థాలు చెపుతూ ఉండేవాడు. అంగదగురువుకు ఈ సంగతి తెలిసింది. నానకు మతానికి శ్రీచంద్రునిమూలాన అపచారం జరుగుతున్నదని తెలిసీకూడా గురుపుత్రుడనే గౌరవంకొద్దీ ఊరుకున్నాడు.

అలా ఊరుకోవడం చూసి శ్రీచంద్రుడు అహంకారంతో పేట్రేగిపోయి, అంగదగురువునుగూర్చి తేలికగా మాటాడసాగాడు. అంతే కాదు. అంగదుణ్ణి ఎలాగైనా అవమానించాలనే దురుద్దేశంతో ఒకనాడు శిష్యుల్ని వెంటబెట్టుకుని అతను కర్తారపురం చేరుకొన్నాడు.

గురుపుత్రుడు వచ్చాడనటంతో అంగదగురువు లేచి ఎదురువెళ్ళి గురునానకునకు నమస్కరించే విధంగానే శ్రీచంద్రునికీ సాష్టాంగపడి గౌరవించాడు.

అహంకారంతో వచ్చిన శ్రీచంద్రుడికి అంత వినయంగా ప్రవర్తించిన అంగదగురువును ఏ విధంగా అవమానించాలో తోచింది కాదు. సాష్టాంగపడి లేస్తూవుంటే అంగదగురువుయొక్క పొడుగాటి గడ్డం శ్రీచంద్రుడికి కనపడి, అతడు వెంటనే, 'ఏమయ్యా, ఎందుకూ గడ్డాన్ని యింత పొడుగ్గా పెంచావు ?' అని హేళనచేశాడు.

అంగదగురువు వినయంతో, 'గురుపుత్రుల పాదరక్షలమీది ధూళిని తుడిచి వెయ్యటానికే ఈ గడ్డాన్ని ఇంత పొడుగుగా పెంచాను' అన్నాడు. ఈ మాటలు వినేసరికి శ్రీచంద్రునికే సిగ్గువేసింది. అతని వెంటనంటి వచ్చిన శిష్యులు అంగదగురువు గొప్పతనాన్ని గ్రహించి శ్రీచంద్రుణ్ణి వదిలి కర్తారపురంలోనే ఆగిపోయారు. నాటితో ఇంక శ్రీచంద్రుడూ, అతని తమ్ముడూ పీఠాధిపత్యంపైన ఆశ వదులుకొన్నారు.



# ముగ్గురు నేస్తాలు (రంగులబొమ్మ కథ) - 3

కురవన్న ఇప్పుడు ఒంటిగాడైపోయాడు. కోతినేస్తం చేసిపోయిన అల్లరికి చింతిస్తూ, అది పొలకబోసినవన్నీ ఎత్తుకోసాగాడు. చెప్పకుండా పోయిన కోతి నేస్తానికి కొంతసేపైన తరువాత మళ్ళీ జ్ఞాపకంవచ్చింది—'అయ్యో, మనలను తుపానుబాధనుండి కాపాడి, తలదాచుకోనిచ్చిన పసివాడిని మరచేపోయానే!' అని. వెంటనే అది చెట్లకొమ్మలమీదినించి గెంతుకొంటూ పోయి, ఆ వెంటనే కురవన్న గుడిసెకు చేరుకొని. తలుపు తట్టింది.

'చాలు, చాలు నీవు చేసిన అల్లరి. నీకు తలుపు తెరిచేదిలేదు...' అని లోపలనుండి కంఠస్వరం వినిపించింది, కోతినేస్తానికి.

అందుచేత కొతినేస్తం ఇవాళ, దేవుడా అంటూ తడికొమ్మలమీద, వర్షం లోనే కాలక్షేపం చేయాల్సివచ్చింది. అంతలో చిలుకనేస్తం రెక్కలు తటతట లాడిస్తూ, అటూయిటూ ఎగిరెగిరి, కోతి పాడుచేయగా మిగిలిన జాడీలూ అవ్వీ పగలగొట్టింది. తట్టలు తిరగబోసింది.

అదీగాక పైన వేలాడగట్టిన ఖర్జూరపు గెలలు ముక్కుతో పొడిచి పొడిచి, కాయలన్నీ రాలగొట్టింది. ఇదంతా చూడగా, కురవన్నకు భయం పట్టుకొని, చిలుకనేస్తాన్ని తరిమివేయబోయాడు. కాని, అది అవతలకు పోతేకద!

అయితే—ఆ గుమ్మానికి అడ్డుగా వున్నది తలుపు కాదు. పులిచర్మం. కొంతసేపటికి చిలుక వెర్రెత్తినట్టుగా ఆ చర్మాన్ని తన ముక్కుతో పొడిచి, రంధ్రంచేసి, దానిలోనించి తుర్రుమని పారిపోయింది! అది అలా పోయిందే చాలునని కురవన్న, చిలుక మళ్ళీ లోపలికి రాకుండా, చర్మంలోపల పడిన రంధ్రానికి ఒక గట్టి తాటాకు అడ్డుపెట్టాడు.

అది పోయినప్పటినించీ కురవన్నకు పాపం చేతినిండా పని తగిలింది. కోతినేస్తం తిరగబోసినవీ, చిలుకనేస్తం చిందరవందర చేసినవీ అన్నీ ఎత్తి, ఎక్కడివక్కడ పెడదామని తగని తాపత్రయంలో మునిగిపోయాడు. అంత లోనే—అడవికి పోయిన కురవన్న అమ్మా, నాన్నా ఇంటికి వచ్చేశారు. అంతా చూచారు. "బాగానే వుంది. చెప్పలేదురా నీకు బిడ్డా, కనపడ్డవాళ్ళంతా నిజమైన నేస్తాలు కాదని..." అంటూ పసివాడిని మందలించబోయారు.

# పరువు పోయినా ....

'ప్రయాగ'



అనగనగా నొక అగ్రహారమున
'వివేకవర్ధను' డను నొక బ్రాహ్మడు.
తనకే సర్వము తెలియునటంచు
విర్రవీగుచు తిరిగాడు.

కట్టు బొట్టులు ఘనాపాఠివలె
మెండుగ తానూ పెట్టాడు.
చుట్టుపట్టుల గ్రామా లన్నిట
ఎటో పేరున పడినాడు.

గంతకు తగిన బొంతగా, కను
బంతిపువ్వంటి పడుచును తెచ్చి
పదుగురు పెండ్లి చేశారు
బుద్ధిగ మసులుకొ మన్నారు.

అల్లుడు ఎంతో చదివినవాడని
అత్త అతనిని పిలిచింది,
కళ్ళవేడుకగ చూదామంచు ;
ఘనాపాఠి మరి కదిలాడు.

వచ్చిన బావను ముచ్చట దీర
పిచ్చిప్రశ్నలు వేశారు ;
'బావా !—చూడీ గ్రంథా' లంటూ
బండెడు ప్రతులు తెచ్చారు.

తెచ్చిన ప్రతులను చూచీ చూడకె
'ఉష్ !—ఇదెంత ?'అని పలికాడు.

ఎంతటి గ్రంథాన్నయినా బావ
ఈసడించి పారేస్తున్నాడని
మేడిపండులో మేలిమి చూడ
కూడి నలుగురూ గుసగుసలాడి,
అయ్యగారి బండారం కాస్తా
అంగడిలో పెట్టాలని తలచి,
అచ్చూ గిచ్చూ లేని పుస్తకం
అచ్చమైన తెలకాగితాలతో,
ముచ్చటగానూ పిర్చీకూర్చీ
మురిపెపు బావకు ఇచ్చారు.

తెచ్చిన గ్రంథం తిరగేశాడు
'అచ్చుతప్పులు మెండ'న్నాడు,
పేరుమాత్రము జ్ఞప్తి లేదని
పెదిమలు విఱచి చూచాడు.

పకపక బావలు నవ్వారు,
పరువును బైట పెటారు.

'పూర్ణానుస్వారంగా' డంటూ
పెద్ద బిరుదొకటి ఇచ్చారు.

# కత్తిలో బింబం



అది ఒక చిత్రమైన రాజ్యం. ఆ రాజ్యంలో ఒక్క చిన్న అద్దంపెంకుకూడా కనిపించదు. ఏమంటే, ఆ రాజ్యాన్ని ఏలేటటు వంటిరాణీ ఆజ్ఞప్రకారం, అద్దాలన్నీ ముక్క ముక్కలుచేసి పారవేశారు. అందుచేత, చూదామంటే మచ్చుకైనా ఎవళ్లదగ్గిరా చిన్న అద్దంముక్కకూడా కనిపించదు. ఒక వేళ ఏ కారణంచేతనైనా అలా ఎవళ్ళవద్ద నైనా కనిపించిందో, వాళ్లకు మరణమే శిక్ష. ఇది రాణి చేసిన శాసనం.

అయితే—ఈ వింతశాసనానికి తగిన కారణం లేకపోలేదు. ఆ రాజ్యం ఏలేటటు వంటి రాణి ఒక కురూపి. అంతటి అసహ్య కరమైన రూపంగల స్త్రీ ఆ రాజ్యంలో లేనే లేదు. ఈ సంగతి రాణికి తెలుసు. తెలియ బట్టే, తన ప్రతిబింబం రాజ్యంలో ఎక్కడా ఎవళ్లకూ కలలోనైనా కనిపించకూడదు అని నిశ్చయించుకొన్నది.

ఇంతకంటే ఆమె నిశ్చయించుకొన్న ముఖ్యవిషయం మరొకటి వున్నది—తన రాజ్యంలో అందకత్తెలు తమ అందం తాముగాని, ఇతరులుగాని తెలుసుకోకుండా చేయాలి. ఏమీ?—తనకు లేని ఆనందం ఇతరులకూ ఉండకూడదని ఆమె వుద్దేశం. అందుకనే ఆమె అద్దం ఉపయోగించటాన్ని నిషేధిస్తూ ఉత్తరువు జారీచేసింది.

ఇప్పుడీ శాసనంవల్ల—ఎంతటి అందకత్తె లైనా తమ సోయగం తిలకించటానికిగాని, చిరునవ్వు పరికించటానికిగాని, పువ్వులు తురుముకొని అద్దంలో అందం చూచుకో టానికిగాని, సావకాశం లేకపోయె. ఎంత అందం వుంటేనేం, ఆ అందం చూచుకొనే అదృష్టం లేకపోయాక!

అద్దంమాటకేం?—చివరకు నీళ్లలోనైనా ఏ స్త్రీకూడా ప్రతిబింబం చూచుకొటానికి వీలులేదట! ఇందుకే, వీలైనంతవరకూ

కొల్లి సత్యవతి




రాజ్యంలోని కాలువలు, చెరువులు, మడుగులూ—అన్నిటిపైనా రాతిచప్టా చేయించేశారు. ఇక నూతులలో ప్రతిబింబం చూచుకుందామా అంటే, అవి చెప్పలేని లోతు. పోతే, ఇక గత్యంతరం యేమిటి?

* * *

ఆ రాజ్యంలోనే, రాజనగరుకు సమీపంలో దమయంతి అనే ఒక యువతి ఉండేది. దమయంతి అందాల రాణి. ఆమెను వరించినతని పేరు చంద్రం. అతడు ఆమె అందాన్ని ఎంతో చక్కా వర్ణించేవాడు. అందుచేత, అద్దం లేని లోటు కనబడకుండా, దమయంతికి మనస్సు తృప్తిగా ఉండేది. కొన్నాళ్ళకు వాళ్ళిద్దరూ పెళ్ళి చేసుకొందామని నిశ్చయించుకొన్నారు.

ఈ సంగతి రాణి చెవిని పడింది. రాజ్యంలోకల్లా దమయంతి బలే అందకత్తె అన్న సంగతి రాణికి ముందే తెలుసు. ఇతరుల సుఖానికి కొంచెమైనా ఓర్వలేని రాణికి, ఈ మాట వినగానే తేళ్ళూ జెర్రులూ పాకినట్టయింది. పొరుగుపచ్చ సహించలేని రాణికి ఎలా ఐనా ఈ పెళ్లి చెడగొట్టాలని దుర్బుద్ధి పుట్టింది.

* * *

పెళ్ళిముహూర్తం ఇంక కొద్దిరోజులుందనగా ఒకనాడు దమయంతి పెరట్లో పచారు చేస్తూంది. ఆమెవద్దకు ఒక అడుక్కొనే ముసిలిది వచ్చి, చూచి, కెవ్వుమని కేకవేసి పడిపోయింది. పడిపోతూ—

'అబ్బా! ఎంత ఘోరం చూడాల్సి వచ్చింది నేను ...!' అన్నది.

'ఏమిటమ్మా! ఏంచూసి జడుసుకొన్నావు?' అని అడిగింది దమయంతి.

'ఏమిటేమిటి!—లోకంలోకల్లా వికృతమైనదాన్ని చూచా...' అన్నది వృద్ధురాలు.

'ఎవరమ్మా ఆ అనాకారి?' అని మళ్ళీ అడిగింది దమయంతి.




'ఎవరేమిటి ?— నువ్వే. నాకు ఇప్పటికి తొంభైయేళ్ళు దాటినై. నీవంటి కురూపిని ఎక్కడా చూచియెరుగను ' అంది.

ఆశ్చర్యపడింది దమయంతి. కుప్ప లాగా కూలబడిపోయింది. ముసలిది అదృశ్యమైపోయింది.

* * *

ఆనాటినుంచీ దమయంతికి తీరని మనస్తాపం పట్టుకొన్నది. 'అయ్యో, నే నెంతటి కురూపిని ! నాది యెంత వికృతాకారం !! ఇంతవరకూ ఈ సంగతి తెలుసుకోనే లేక పోయానుకద !'— ఇదే గోల. ఇదే పలవరింత. ఆమెను ఓదార్చటానికని చంద్రం ఎన్నోవిధాల ప్రయత్నించాడు. లాభం లేక పోయింది. ఇప్పుడు పెళ్లిగొడవ యెత్తితే దమయంతి మరీ కుమిలిపోసాగింది.

ప్రాధేయపడ్డాడు చంద్రం. ఏమన్నాసరే, 'చంద్రం !— నువ్వంటే నాకు పంచప్రాణాలున్నూ. కాని, చూస్తూ చూస్తూ, కురూపినైన నేను నీకు భార్యను కాలేను. నిన్ను మోసగించలేను ' అని చెప్పింది.

దమయంతి కేవలమూ భ్రమలో పడి కొట్టుమిట్టాడుతున్నది. ఆమెకు నిజంచెప్పి వప్పించటం ఎలా ?- ఈ సమస్యతో చంద్రం అహోరాత్రాలు మథనపడజొచ్చాడు. ఇందుకు ఒక్కటే మార్గం. దమయంతి అద్దంలో తన ప్రతిబింబం చూసుకొంటే తప్ప నమ్మదు. చూడబోతే, రాజ్యంలో ఎక్కడా అద్దమే లేదుకదా. సాహసించి ఎక్కడైనా సంపాదించి తెచ్చుకుందామంటే, రాణికి తెలిస్తే పుచ్చె ఎగిరిపోతుందాయె !

చివరకు చంద్రం దమయంతికి నచ్చజెప్పి, రాణివద్దకు బయల్దేరదీశాడు.

రాణివద్దకు పోయి 'కరుణించు 'మని మొరపెట్టుకొన్నాడు, చంద్రం. 'ఒక్క అద్దం అనుగ్రహించు'మని వేడుకొన్నాడు.

ఈ ప్రార్థనవినగానే రాణి "మా యెదుట నిలిచి, ఇటువంటి కోరిక కోరటానికి నీకెన్ని

గుండెలున్నవిరా?" అని గద్దించింది. అప్పుడు అతడు తన దమయంతికి పట్టు కొన్న దుఃఖం ఎటువంటిదో మనసువిడిచి వెల్లడించాడు: 'మన్నించాలి మహారాణీ! మీ ఎదట వున్న ఈ అమ్మాయి చిత్రమైన-సంకోచంతో సతమతమైపోతున్నది. పాపం, తను కురూపిని అనుకొంటున్నది' అన్నాడు.

'కాకేమి? ఇంకా సందేహమా?...' అన్నది రాణి, హుంకరిస్తూ.

దమయంతికి తల గిర్రున తిరిగి పోయింది. 'ఇక ఈ బతుకెందుకు? ఆనాడు ఆ ముసిలిదీ ఇలానే చెప్పింది. ఇప్పుడు మహారాణీవారున్నూ ఆ మాటనే చెబు తున్నారు...' అంటూ, సోలిపోయింది!

రాణి చేసిన తంత్రమంతా ఇట్టె పసి కట్టాడు చంద్రం. ప్రచండుడయ్యాడు. అత నికి వళ్ళు మండిపోయింది. 'ఏమిటీ రాణి! పిచ్చిగానే ఎత్తిందా? లేకుంటే, కావాలనే అబద్ధం ఆడుతున్నదా? త్రిలోకసుందరి ఐనటువంటి నా దమయంతిని కురూపి అం టుందా? ఏమి సాహసం! పైగా, కుట్రచేసి ఒక ముసలివానిచేత నాటకమాడిస్తుందా! ద్రోహం! ద్రోహం!!' అన్నాడు.

ఈ మాటలు అంటూవుండగానే భటులు వచ్చి, అతనిని పట్టివేశారు. రాణి కూర్చుని వున్న సింహాసనానికి పక్కనే తలారి వున్నాడు. సైగచేసింది రాణి.

కత్తి యెత్తాడు తలారి. విశాలమైన ఆ కత్తి తళతళ మెరిసిపోతూవుంది!! అక స్మాత్తుగా రెండు గావుకేకలు వినిపించనై: ఎవరివి ఆ కేకలు?—తళతళ మెరిసే, విశాలమైన ఆ కత్తిలో యవ్వనవతి ఐన దమయంతి తన ప్రతిబింబం చూచుకొని, ఆనందాతిశయంతో పెట్టిన కేక మొదటిది!

రెండవ కేక రాణిది. మరణబాధవంటి మూలుగులాగా వున్నది అది. వికృతమైన రాణికూడా, తన రూపం ఆ కత్తిలో కన బడగానే, గుండె అవిసి ప్రాణం వదిలింది.



## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

1954 మేనెల సంచికలో ప్రకటింపబడే ఫోటోలకు నమూనాలు





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.

★ మార్చి 10-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంతమాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/-లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26.

---

## ఏప్రిల్ నెల చందమామలో

ప్రచురింపబడే ఫోటోలకుగాను, ఈ దిగువ ఉత్తమవ్యాఖ్యలకు బహుమతి యివ్వడమైనది

మొదటి ఫోటో : పట్టుపడిన దిట్ట | రెండవ ఫోటో : పుట్ట విడిచి బుట్ట

పంపినవారు : కె. ఎస్. గుప్త — అనకాపల్లి

బహుమతిమొత్తం రూ. 10/- ఏప్రిల్ సంచిక వెలువడినవెంటనే పంపబడుతుంది.

విజయవంతముగా
ప్రదర్శింపబడుచున్న



విజయ వారి

# చంద్రహారం

డైరెక్టర్
కె. కామేశ్వరరావు
బి.ఎ.





నిర్మాతలు.... నాగిరెడ్డి & చక్రపాణి

Printed by B. NAGI REDDI at the B. N. K. Press Ltd., Madras 26, and Published by him for Chandamama Publications, Madras 26, Controlling Editor SRI 'CHAKRAPANI'

Photo by P. K. Patel



బహుమతి
పొందిన వ్యాఖ్య

జై శంకర

పంపినవారు :
పి. సీతమ్మ - అనకాపల్లి

